SRI VENKATESVARA ORIENTAL SERIES—No. 10

EDITOR :—P. V. RAMANUJASWAMI, M.A.

# శ్రీ వేంకటేశ్వరవచనములు

## శ్రీ వేంకటేశ్వరప్రభాతస్తవము, ను

శ్రీ తాళ్లపాక పెదతిరుమలాచార్య

రచితములు

శ్రీవేంకటేశ్వరప్రాచ్యపరిశోధనశాలలో ఆంధ్రవాఙ్మయ పరిశోధకుఁడగు

శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిచే

పరిశోధింపఁబడినవి



తిరుపతి

తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాశాల

1945

[వెల రూ. 1-8-0

# పీఠిక

## 1. వచనరచన

ఆంధ్ర వాఙ్మయమునఁ బ్రాచీన కాలమున వచనకావ్య రచన మంతగాఁ గానరాదు. భారతాదికృతులలోఁ బద్యరచనముల నడుమ నెడనెడఁ గానవచ్చు వచనరచనలే కాని వచనైకరచనలు చాలఁ దక్కువ. పద్యైకరచన లంతకంటెను జాలఁ దక్కువ. తిక్కన నిర్వచనోత్తరరామాయణమొక్కటే యట్టిది పేర్కొనఁదగినది. సంస్కృతమునఁ బద్యైక రచనలే యెక్కువ. చంపూరచన లంతకుఁ దక్కువ. గద్యైకరచనలును దక్కువే. దక్షిణదేశభాషలలోఁ గర్ణాటకమున నొకతీరు గద్యరచనలు చాలఁగలవు. అవి ప్రాయికముగా వీరశైవులు భగవత్ప్రార్థనాతత్త్వార్థ నిరూపణపరములుగా రచించినవి. అట్టి రచనలఁ బెక్కింటిని జేర్చి గర్ణాటకులు 'వచన శాస్త్రము' అనుపేరఁ బేర్కొనిరి. కొన్ని సంపుటములుగా నిటీవల వానిని బ్రకటించిరి. కన్నడమున నాయారచనము లించుమించుగాఁ బండ్రెండవశతాబ్ది నుండి యారంభమయిన వనవచ్చును. ద్రవిడమునఁ బ్రాచీనకాలమున వచనైకరచనలు లేనేలేవట! వ్యాఖ్యానరూపవచనరచనము లుండుఁగాక యవి వచనకావ్యరచన లనఁదగనివి.

సంస్కృతమున వచనరచన ముత్తెఱఁగులని వామనుఁడు కావ్యాలంకార సూత్రమున నిట్లు చెప్పినాఁడు.

“కావ్యం గద్యం పద్యంచ. గద్యం వృత్తగన్ధి చూర్ణముత్కలికాప్రాయంచ; పద్యభాగవద్వృత్తగన్ధి. అనావిద్ధలలితపదం చూర్ణమ్. విపరీతముత్కలికాప్రాయమ్.” అని

పద్యపాద భాగములకలయికతో వృత్తములవాసనఁ దోఁపించుచుండు వచనరచనము వృత్తగన్ధి. దీర్ఘసమాసముల గడబిడలులేక తేలిక పలుకులతోనుండు పొడిపొడి వచనరచనము చూర్ణము. దీర్ఘసమాసముల గడబిడలు గలిగి, యుద్ధతోక్తులతో నుండు రచన ముత్కలికాప్రాయము. అని;

వామనునికిఁ దర్వాతివాఁడగు విశ్వనాథకవిరాజు వచనము నాల్గుదెఱఁగుల విభాగించెను. "వృత్తలేశ విహీనమయిన గద్యము ముక్తకము వృత్తగంధి ఉత్కలికాప్రాయము చూర్ణకమునని నాలుగు విధములు. తొలిది సమాసరహితము. రెండవది వృత్తభాగములతోఁ గూడుకొన్నట్టిది. మూఁడవది దీర్ఘసమాసాఢ్యము; నాలవది అల్ప సమాసకము."

పయి రచనాప్రభేధములలో రెండింటికి మాత్రము తెలుఁగున భారతాది కృతులలోని వచన భాగములనుండి లక్ష్యము లెత్తి చూపవచ్చును. ప్రాయికముగాఁ గవిత్రయమువారి రచనలలోని వచన రచనములు చూర్ణకము లనఁదగినవి. నాచనసోమన, పోతన ప్రభృతుల రచనలు గొన్నియుత్కలికా ప్రాయము లనవచ్చును. వృత్తగంధిరచనలు తెలుఁగునఁ బ్రాచీనకాలమున నంతగా లేవు. ప్రబంధరాజ వేంకటేశ్వరవిలాసమున వృత్తగంధి వచనరచనలున్నవి. నేఁటికాలమున శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు రచించిన * 'ప్రాఁదెనుఁగుఁగమ్మ' వృత్తగంధియే. మచ్చుతునుక :—

సిరిఁదాల్చుతేఁడొగిఁ జిన్నిచూడ్కులఁజూచు తెనుఁగుఁ . జదువులరచ్చ తీర్పరులార ! గ్రిందనుగ్గై వ్రాలుసేసిననేనయా ! యణకువ మెఱయుచు, నాయోపుకొలఁది. దెనుఁగుఁజదువులగుఱిచి, జానుమివులంగఁ దొలితెనుఁగునుడులన తేటతెల్లగను, విన్నపమొక్కండు వినిపింతుమిమ్ము మోడ్చియునిరుచేయి, బ్రోఁకరిలఁబడియు, నెఱఁగియుఁగ్గైవారమొనరంగఁచేసి, తద్దయువేఁడుదు నాలింపుఁడయ్య మీరపోలెను నేనుఁ బ్రాఁబొత్తములు సాలఁజదువలేన.

కర్ణాటకమునఁగూఁడ వృత్తగంధి రచనములున్నవి. రామాశ్వమేధాదులందు లక్ష్యములు చూఁడనగును.

సంస్కృతమున వామనుఁడుపేర్కొన్న ముత్తెఱఁగుల రచనములునున్నవి. కాదంబరీ, దశకుమారచరిత్ర, యశస్తిలకచంపూప్రభృ

* చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటము ౨ సంచిక 3.

తులందును, శ్రీభగవద్రామానుజాచార్యులవారి గద్యత్రయమునందును, పాల్కురికిసోమనాథుని గద్యగ్రంథములందును వీనికి లక్ష్యములున్నవి. శ్రీభగవద్రామానుజాచార్యులవారి గద్యత్రయమున నుండి ముత్తెఱఁగుల రచనలకు మచ్చుతునుకలఁ జూపుచున్నాఁడను. చూర్ణమునకు-

అపారకరుణామ్బుధే, అనాలోచిత విశేషావిశేషలోకశరణ్య, ప్రణతార్తిహర, ఆశ్రితవాత్సల్యైకమహోదధే, అనవరతవిదితనిఖిల భూతజాతయాథాత్మ్య, సత్యకామ, సత్యసఙ్కల్ప, ఆపత్సఖ, కాకుత్స్థ, శ్రీమన్నారాయణ, పురుషోత్తమ, శ్రీరఙ్గనాథ, మమనాథ నమోఽస్తుతే. (శ్రీరఙ్గగద్యమ్)

ఉత్కలికాప్రాయమునకు-

స్వచ్ఛన్దానువర్తి స్వరూపస్థితిప్రవృత్తిభేదాశేష శేషతైకరతిరూప నిత్య నిరవద్య నిరతిశయజ్ఞానక్రియైశ్వర్యాద్యనన్త కల్యాణగుణగణ శేషాసన గరుడప్రముఖ నానావిధానన్తపరిజన పరిచారికా పరిచరితచరణ యుగల పరమయోగి వాఙ్మనసాపరిచ్ఛేద్యస్వరూపస్వభావ స్వాభిమత వివిధవిచిత్రానన్త భోగ్యభోగోపకరణ భోగస్థానసమృద్ధానన్తాశ్చర్యానన్త మహావిభవానన్త పరిమాణనిత్యనిరతిశయ శ్రీవైకుణ్ఠనాథ-

(శరణాగతి గద్యమ్)

వృత్తగన్ధికి-

ప్రత్యగ్రోన్మీలిత సరసిజ సదృశ నయన యుగలం, స్వచ్ఛనీలజీమూత సఙ్కాశమ్-అత్యుజ్జ్వల పీతవాససం-స్వయంప్రభయా అతి నిర్మలయా అతిశీతలయా స్వచ్ఛయా మాణిక్యాభయా-కృత్స్నం జగద్భాసయన్తమ్-అచిన్త్యదివ్యాద్భుత నిత్యయౌవనస్వభావ లావణ్యమయామృత-సాగరమ్, అతి సౌకుమార్యాదీషత్ప్రస్విన్నవదాలక్ష్యమాణలలాటఫలకదివ్యాలకావలీవిరాజితం - ప్రబుద్ధముగ్ధాంబుజ చారులోచనం- సవిభ్రమభ్రూలతమ్ - ఉజ్జ్వలాధరమ్-శుచిస్మితం-కోమల గణ్డమ్-ఉన్నసమ్-ఉదగ్రపీనాంస విలమ్బికుణ్డలాలకావలీ బన్ధురకమ్బు

కస్థరం-ప్రీయమానతం సోత్పలకర్ణభూషణశ్లథాలకా-నిమర్ద శంసిభి-శ్చతుర్భి రాజానువిలమ్బిభి ర్భుజై -ర్విరాజితం-అతికోమలదివ్య రేఖాలఙ్కృతాతా ప్రమకరతలం, దివ్యాఙ్గులీయక విరాజితమ్, అతికోమలనఖావలీ విరాజితం, అనురక్తాఙ్గులీభిరలంకృతంమ్, తత్క్షణోన్మీలితపుణ్డరీకసదృశచరణయుగళమ్, *(శ్రీవైకుణ్ఠగద్యమ్.)

తెలుఁగున లక్షణగ్రంథకర్తలు వచనరచనల నిట్లు పేర్కొనిరి.

క॥ కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం
బున మెఱయు గద్య మదిదాఁ
దెనుఁగుకృతుల వచనమనఁగ దీపించుఁగడున్

గద్యము-స్వస్తిసమస్తభువనరక్షాదక్ష శ్రీపుండరీకాక్ష భుజగపతి సింహాసనారూఢ సురనికరమకుటతటఘటితసురుచిర మణిగణప్రభా విభాసితపాదపీఠ వేదనినాదానుకార గౌరవలలిత నూపురాలంకృతచరణ సరసిజయుగళ నవ్యపదాంగుష్ఠనఖమయూఖరేఖాయిత సురసరిత్ప్రవాహ పీతాంబరధర నూత్నమేఖలాకలిత కటితటప్రదేశ చతురాననజనక నాళీక శోభితనాభి సరోవర యఖండబ్రహ్మాండకలాపగోపననిపుణోదర క్షీర సాగరతనయామనోజ్ఞగేహీకృతవిపులవక్షస్స్థల కనత్కనకకటక కేయూర ప్రముఖ భూషణభూషితచతుర్భుజ శంఖపంకజ సుదర్శన గధాధర కిరీట కుండలాభిరామయనవరతప్రసన్నవదన కౌండిన్యవరద శ్రీయనంత పద్మ నాభ నమస్తే నమస్తేనమః-" (అనంతుని ఛందము)

"ఇఁక సందు గద్యలక్షణం-మఱియు నందు గద్యయు నైదుభేదం బుల విహరించు-నయ్యవి యేవంటేను-గద్యయు, బిరుదుగద్యయు, చూర్ణికయు, వచనంబును, విన్నపంబులునన గద్యభేదంబులైదును ప్రమోదంబున వివిధమ్ములై వినోదించు నందు గద్యక్రమంబెటువలె నంటేని ౧ గద్య-అనుకరణశబ్దయుక్తంబై యొప్పు నందు ౨ బిరుదగద్య సంబోధనాంత పదబంధురంబునై వర్తిల్లు నందు 3 చూర్ణిక ద్వివచన

* ఇందు ఆళవందార్ల స్తోత్రరత్న శ్లోకముల తునుకలున్నవి.

బహువచనసందర్భములగు విభ క్త్యనుశాసన సమాసాది సమాసాదిత కల్పనానల్ప జల్పితంబై వెలయునందు ర వచనంబులు బహుప్రకార రచనా నిచయప్రాచుర్యమ్ములై సంచరించు నందు ౫ విన్నపంబులెన్న విన్ననై ఋజుమార్గమ్ముల ననుగమించి మించు నీపంచ విధమ్ములు మితివిరహితమ్ములై స్వేచ్ఛాకల్పనా గౌరవమ్ముల కొలందుల విలసిల్లు.

(లక్షణశిరోమణి)

మీఁది లక్షణగ్రంథకర్తలలో ననంతుఁడు పదునైదవ శతాబ్ది వాఁడు. అతఁడు చెప్పిన గద్యలక్షణమున కనుగుణముగానే కర్ణాటాంధ్ర భాషలలోని ప్రాచీనవచనైకరచనలున్నవి. లక్షణశిరోమణికారుఁడు పొత్తపి వెంకటరమణకవి పదునేడవశతాబ్దివాఁడు గాఁబోలును! అతఁడు వచన రచనలనైదువిధముల విభజించినాఁడు. అతఁడు పేర్కొన్న 'విన్నపములే' యనంతామాత్యుఁడు చెప్పినగద్యములగును. ఇట్టి రచనములొకటి రెండు నిమిషములకు మించనికాలమునఁ జదువఁదగినవై స్తుత్య దేవతా సంబోధక పదాంతములై యుండును. వీనినే తాళ్లపాకవారు వచనగీతము లని తాళగంధిచూర్ణకములనికూడఁ బేర్కొనిరి. ఈ విషయ మిఁక ముందు వివరింతును. అనంతామాత్యుని నాఁటికిఁ దెలుఁగున భారత భాగవతాది గ్రంథముల వచనైకరచనలు లేవు గాఁబోలును! అట్టివాని నాతఁడు పేర్కొనలేదు. పదునాఱవ శతాబ్దినుండియే భారతభాగవతా దుల వచనైకరచనలు తెలుఁగున వెలసినట్లున్నవి. లక్షణశిరోమణికారుఁ డట్టివానిని దాను విభజించిన పంచవిధ విభాగములలో నాలుగవభేద మగు 'వచనము'గా నిర్వచించినాఁడు. ఈతని నాఁటికిఁ జూర్ణిక 'పాడిపాడి పలుకుల ప్రసన్నరచనగాక' సంస్కృత ఫుటుత్కలికా ప్రాయరచనగామాఱినది. ప్రబంధరాజవిజయ వేంకటేశ్వర విలాసాదులం దింకను సర్వలఘువచనములు, అంత్యానుప్రాసచతుర్దళచూర్ణికలు మొదలగు వచనచిత్రరచనా ప్రభేదములు చూడఁదగును. మఱియు నంధ్రమున నన్నయాదికవుల కృతులలోని యాశ్వాసాంత వచనరచనలను 'ఆశ్వాసాంత గద్యము'లని పేర్కొనుటకలదు. అవి లక్షణశిరోమణి కారుఁడు చెప్పిన 'బిరుద గద్యము'లగు ననుకొనవచ్చును. అట్టి

బిరుదగద్యములు సంబోధనాంతములుగా నుండవలెనని యాతఁడు చెప్పినాఁడు. అట్లే ప్రాచీనరాజుల బిరుదగద్యములున్నవిగాని యాగద్యముల కెల్ల సంబోధనాంతత నియతముగా నుండునన్న నిర్ణయము నిలువదేమో! ఆశ్వాసాంత బిరుదగద్యములు సంబోధనాంతములుగా నుండవుగదా!

అనంతామాత్యుఁడు (వచన)గద్యమనియు, లక్షణశిరోమణికారుఁడు విన్నప మనియుఁ జెప్పినతీరు రచనము లవి సంస్కృతమున శ్రీభగవద్రామానుజాచార్యులవారు రచించిన గద్యత్రయమును పాల్కురికి సోమనాథుఁడు రచించిన పంచప్రకారగద్యాదులను బురస్కరించుకొని, కర్ణాటాంధ్రములలో వైష్ణవ శైవభక్తులు సాగించిన రచనములయి యుండునని నేననుమానించుచున్నాఁడను. తెలుఁగున నాకుఁగానవచ్చిన యిట్టి రచనలలోఁ బ్రాచీనమనఁదగినవి 'సింహగిరి వచనములు'. వీనికిఁ గృష్ణమాచార్య సంకీర్తనములని నామాంతరము.*

మచ్చునకాతనివచనమొకటి-

దేవా! పదికోట్ల యజ్ఞాదిక్రతువులు నడపంగానేమి, తొమ్మిది కోట్ల తులాభారంబులు తూఁగంగానేమి, యెనిమిది కోట్ల సువర్ణదానంబులు, నేడుకోట్ల గోదానంబులు, నాఱుకోట్ల భూదానంబులు, నయిదు కోట్ల కన్యాదానంబులు, నాలుగుకోట్ల వస్త్రదానంబులు సేయంగానేమి, మూఁడుకోట్ల సత్యాదివ్రతంబులు నలుపంగానేమి. రెండుకోట్ల యన్నదానంబులు గావింపగానేమి, కోటి స్నానంబులు సేయంగానేమి, మీ నామోచ్చారణంబు సేయక! పదివేల యజ్ఞాది క్రతువులు నడపిన దేవేంద్రుండునిలువెల్ల యోనులయ్యెను. తొమ్మిదికోట్లతులాభారంబులు తూగిన దుర్యోధనుండు యమపురికేఁగెను. ఎనిమిది కోట్ల సువర్ణదానంబులు సేసిన కర్ణుండు పసిండికొండమీఁది యన్నంబుల కపేక్షించెను. ఏడుకోట్ల గోదానంబులుచేసిన కార్తవీర్యార్జునుండు గోహత్యా బ్రహ్మహత్యా పాతకంబులఁ బొందెను. ఆఱుకోట్ల భూదానంబులు

---

* ఆ వచనములు రచియించిన కృష్ణమాచార్యుఁడు కాకతీయప్రతాపరుద్రుని నాఁటివాఁడని, యేకశిలానగర చరిత్రాదులవలనఁ దెలియగును.

చేసిన బలి విష్ణుపాదంబునఁ బాతాళంబునకేఁగెను. అయిదు కోట్ల కన్యాదానంబుచేసిన ధ్రువుండు కాశీక్షేత్రంబునఁ బంద్రెండువేల యేండ్లు భిక్షంబెత్తెను. నాలుగుకోట్ల వస్త్రదానంబులు చేసిన మార్కండేయుండు మతిహీనుండాయెను. రెండుకోట్లన్నదానంబులు చేసిన ధర్మజుండు యమపురి తొంగిచూచెను. కోటిస్నానంబులు చేసిన కుమారస్వామి కోరిక సిద్ధించదాయెను. దేవా! మీ నామోచ్చారణంబు చేసి ప్రహ్లాద నారదపుండరీక వ్యాసశుక శౌనక భీష్మదాల్భ్య రుక్మాంగదార్జున బలివిభీషణ భృగుగాంగేయాక్రూర విదురాదులగు పరమ భాగవతోత్తములు కృతార్థులైరి. కావున యతిరామానుజ మునిపరందాతారు (?) అనాథపతియైన స్వామీ సింహగిరి నరహరీ నమోనమో దయానిధీ." (సింహగిరి నరహరి వచనములు) కృష్ణమాచార్యసంకీర్తనములు.

---

సీ. కటకేంద్రుకూఁతురి కౌఁగిటిలోఁ దక్కెఁ జెళ్లపిళ్లస్వామి చేతఁగాదు,
కృష్ణమాచార్య సంకీర్తనంబులఁజొక్కె సింహాద్రియప్పని చేతఁగాదు,
కవ్వంపుఁగొండ సంఘర్షణోద్ధతిఁజిక్కె శ్రీకూర్మనాథుని చేతఁగాదు,
శాక్యతొండనితాల జడికెంతయునుస్రుక్కెఁజెన్నమల్లేశుని చేతఁగాదు,
పవనజవననిరాఘాటయవనఘోట! హరణజయధాటి మీచేతనౌనెమేటి
వాడువొకసన్నఁజూడుమేలావరాకు। శత్రుసంహార! వేంకటాచలవిహార!

సీ. తాళ్లపాకచినన్నదండెమీటులుగావు గోమాంసభుగ్దుర్గుణరవంబు
బాటసంగినబంకమంటిపువ్వులుగావుయవనాధములచిలుకంపగములు
సామడిగ్గియనీటిచల్లులాటలుగావు పాశ్చాత్యభటుల తుపాకిగుండ్లు
సంపెంగబాకులు జరగించుటలుగావు రిపులపాశెములు దర్శించుపగలు
బంటుపంతముతగదంచుబంటకాపుఁదనమ్ముగెకొంటివిదిమంచిగుణమెదినము
జనముదెచ్చిన ధనములప్పనములిచ్చి। శత్రుసంహారవేంకటాచలవిహార!

సీ. పొట్టెళ్లగతిఁబట్టిబోడిసన్యాసుల ఢీయనితాఁకలాడించునొకఁడు
సోమయాజులబ్రహ్మసూత్రముల్ద్రెంచిసింగాణివిండ్లకునల్లెగట్టునొకఁడు
ఖూబుఖూడాయంచు గుడికీలు గుఱ్ఱము నెక్కి-ధేయని తరలెత్తునొకఁడు
పైకాలుగొమ్మనిబల్మిఁగోమటివారి చెలువపైఁబడిబూతుసేయునొకఁడు

ఇంకను నిట్టివి శంకర వచనములని, శఠకోప విన్నపములని, కాలజ్ఞాన వచనములని, కాశికావచనములని, భవానీమనోహరవచనములని, శివరాజయోగవచనములని, లక్ష్మీవల్లభవచనములని, శేషగిరినాథ వచనములని మఱియుఁ గొన్నిపేళ్లతో వచనరచనలు ప్రాచీనములుగాన వచ్చుచున్నవి. అవి యెల్ల నించుమించుగాఁ బదునాలుగవశతాబ్దికిఁ దరువాతివే కాఁదగు ననుకొందును. ఇప్పటికి నాయెఱుకకందినంతలోఁ గాల నిర్ణయముఁ జెప్పదగిన ప్రాచీనవచన రచనలలోఁ గృష్ణమాచార్య సంకీర్తనముల తర్వాత నీ ‘ వేంకటేశ్వరవచనములే ’ పేర్కొనఁదగినవి. ఈ రెంటిలోఁ దొలిది పదుమూఁడవశతాబ్ది తొలిది. రెండవది పదునైదవ శతాబ్దితుదిది. ఇక్కడఁ బ్రసక్తములు శ్రీవేంకటేశ్వరవచనములు

## 2. తాళగంధి చూర్ణకములు.

ఇవి తిరుపతి క్షేత్రమున శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్యాస్థానమున సంకీర్తనాచార్యులుగ సుప్రఖ్యాతులయిన తాళ్లపాకవారు రచించిన వానిలోనివి. ఏతత్కర్త తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు పదునైదవ శతాబ్ది చతుర్థపాదమున జనించి బదునాఱవ శతాబ్ది పూర్వార్థమున వర్తిల్లినవాఁడు. *ఈ పెద తిరుమలాచార్యులవారికిఁ గుమారుఁడయిన చినతిరుమలాచార్యుఁడు, తన తండ్రి పెదతిరుమలాచార్యులు వ్యాఖ్యానించిన తీరుననుసరించి, తనతాత తాళ్లపాక యన్నమా

---

యవనసమ్మర్దదుర్దినంబైనదిగువ। తిరుపతినిజూడుమిటువంటితఱిని నిదుర వోవుచున్నాఁడు మాయన్నలేవలేక। శత్రుసంహార! వేంకటాచలవిహార!

* ఆతనికాలముననే యీవచనములు రాగిరేకులమీఁదఁ జెక్కింపఁబడి తిరుపతి దేవస్థానమున భద్రపఱుపఁబడినవి. ఈ వచనములేకాక తాళ్లపాకవారి పద్యగద్యగేయ రచనములనేకములు రాగిరేకులపైఁ జెక్కఁబడి భద్రపఱుపఁబడినవి. అందుఁ గొన్ని రేకులు అహోబలమునకు శ్రీరంగమునకును గూడఁ జేర్పఁబడినవట! ఇటీవల నహోబలములోని రాగిరేకులు కొన్ని రాగిపాత్రలకై యమ్మఁబడినవనియు, నట్లమ్మఁబడినవి, నాలుగయిదువందల రూపాయలకిలువఁగల రాగిరేకులనియు వింటిని. తిరుపతి రేకులమీఁది సంకీర్తనాదులు శ్రీ తిరుపతి దేవస్థానమువా రిప్పటికిఁగొన్నింటి ముద్రించిరి.

చార్యుఁడు సంస్కృతమున రచించిన 'సంకీర్తనలక్షణమును' దెలుఁగు నకుఁ బరివర్తనము చేసెను. అందీవచనరచనల నిర్వచనమిట్లున్నది.

" మఱియుఁజూర్ణాఖ్యపదం బెట్టిదం బేని-

క॥ ధరఁగృష్ణాచార్యాదిక పరికల్పితపదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం బరగు, నదినిరుక్తనామభాసితమగుచున్

మఱియుం దచ్చూర్ణ విధం బెట్టిదనిన ;

క॥ ఛందోగణముల నియతిం బొందక తాళప్రమాణమునఁ గడుఁజెలువై
కొందఱిచేఁ దచ్చూర్ణం బందముగాఁ దాళగంధి యనఁ బొగడొందున్"

పూర్వోదాహృతమైన సంకీర్తనలక్షణ గ్రంథనిర్వచనముచొప్పునఁ దాళగంధి చూర్ణము లనఁదగిన యీ వచనములను రచించి శ్రీస్వామి వారి సన్నిధిని శ్రీ తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు రాగ తాళ ములతో నాలాపించువాఁడు కాఁబోలును! రాగిరేకులనుండి యెత్తి శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారిచేతను ముందు ముద్రింపించిన వచన ములు నలుపదేడింటికి రాగ తాళములు నిర్ణీతములయియున్నవి.* మఱియు నం దీవచనములు 'వైరాగ్యవచనమాలికా గీతము'లను పేరఁ బేర్కొనఁబడినవి. అనఁగా నివి వచనములేయయినను గీతములుగాఁ బాడఁదగినవన్నమాట ! అందుచేతనే యివి సంకీర్తనలక్షణమున 'తాళ గంధిచూర్ణకపదము'లని పేర్కొనఁబడినవి. సంస్కృతమున వామ నుఁడు వృత్తగంధి, ఉత్కలికాప్రాయము, చూర్ణము ననిముత్తెఱఁగులగల వచనరచనచెప్పఁగా నితఁడా చూర్ణమను వచనవిభాగమునసే తాళగంధి యని పదరచనా విభాగముగాఁ గల్పించినాఁడు. ఈ తెలుఁగు వచన రచనలకుఁ జూర్ణమను పేరు పొడిపలుకులతోనుండుటచే నేర్పడినదనుట నితఁడు సూచించినాఁడు. మన యీ వేంకటేశ్వర వచనములు పొడి పొడి పలుకుల కూర్పే కాని, యిందుద్ధతోక్తులు ప్రౌఢసమాసములు లేవు. ఇట్టి పద రచనములకుఁ గృష్ణాచార్యాదులు, పరికల్పకులని యీ

* గ్రంథావసానమున ముద్రింపఁబడినవి.

సంకీర్తన లక్షణ పద్యమున నున్నది. ఇంతకముందు నేనుదాహరించిన కృష్ణమాచార్యసంకీర్తనములకర్త కృష్ణాచార్యుడే సంకీర్తనలక్షణకారుడు పేర్కొన్న కృష్ణాచార్యుఁడు కాఁగలడు. ఇట్టి రచనములకుఁ కృష్ణమా చార్య సంకీర్తనములనఁబడు సింహగిరినరహరి వచనములే ప్రప్రథమ రచనము లని యీ సంకీర్తన లక్షణ గ్రంథోక్తిని బట్టి గుర్తింప నగును. దీనిని లక్ష్యీకరించుకొనియే యనంతామాత్యుఁడు గద్యనిర్వచనము నట్లు చేసియుండును. తర్వాతి కాలమున నిట్టివచనములు 'విన్నపము' లనియుఁ బేర్కొనఁబడినవి.

## వేంకటేశ్వర వచనములు—వానియోగ్యత

ఈ వచనములకు రచనములో నామపూర్వి యేదియుఁగానరాదు. వస్తువిన్యాసమునఁగూడఁ గ్రమపద్ధతి యేదియుఁదోపదు. కవియప్పు డప్పుడు తనకుఁ దోఁచినతత్త్వవిషయముల నీశ్వరస్తుతిపరములు గావించి విడివిడిగనే వచనములుగా రచించినాఁడు గాఁబోలును! ఇందు విశిష్టా ద్వైత సిద్ధాంత విషయములు సర్వత్ర కరడుగట్టియున్నవి. గ్రంథకర్త స్మార్తసందవకిక బ్రాహ్మణుఁడైనను వైష్ణవమతము స్వీకరించినవాఁడు. జాలిజాలిగాఁ గొసరికొసరి శ్రీవేంకటేశ్వరస్వామిని గవి యేతద్వచన రచనలలోఁ బలుదెఱఁగులఁ బరమార్థలబ్ధికై ప్రార్థించును. విశిష్టాద్వైత సిద్ధాంతపు జీవగఱ్ఱయగు 'శరణాగతి' యిందుఁజాలఁజక్కఁగా సవద రింపఁబడినది. కవి యిందు స్వామిని బలుచోట్ల నేకవచనముననే తేలికగా 'నీ' వని మెచ్చరించును. తోడ్తోఁ గొన్నిపట్టుల 'మీ' రని గొప్పగా బహూకరించును. తండ్రియొడిలో నాటవేడ్కలతోనుండు ముద్దులబిడ్డఁడు తండ్రిని నెయ్యంపుమురువునఁ దొక్కుఁబల్కులతో నీవనితుంకరించుట, యంతలోనే పెద్దఱికపుహద్దుతోపగా మరల మీరని బహూకరించుట, యందం దనుభూయమానమే కదా! ఆయనుభూతి నాకీ తీరునకు సమర్థకముగాఁదోఁచినది. అన్నిచోట్ల నేకవచనమునో, బహువచనమునో యొక్కదానినే యుంపవచ్చునుగాని పయిసమర్థనము ననుసరించి నేనట్లు మార్పుచేయలేదు.

ఇందు ౧౪౭ వచనమున నూటయెనిమిది తిరుపతుల పేళ్లు పేర్కొనఁబడినవి. నిత్యానుసంధానాదులగు నర్వాచీన ద్రావిడ వైష్ణవసంప్రదాయ గ్రంథములలో నూటయెనిమిది తిరుపతుల (దివ్యస్థలముల) పేళ్లు ముద్రితములయియున్నవి. వాని పరిగణన మాతిరుగా నేనాఁడు జరగెనో గుర్తింపఁజాల నయితిని. ఆ పేళ్లకు నిందున్న పేళ్లకుఁ జాల భేదమున్నది. క్రీ. ౧౪౮౦ ప్రాంతముల నూటయెనిమిది తిరుపతులపేళ్లీవిధముగా నుండెనని దీనిఁబట్టి తెలియనగును. కాని యీపేళ్లుగల వచనపు వ్రాఁతప్రతియొక్కటే తప్పులతో నుండుటచే నీ ముద్రణమున వ్రాఁతలోఁగల యాతీరేయున్నది. ఇందుఁగొన్ని స్థలములపేళ్లుతప్పులుగా నున్నట్టున్నవి. ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసమునను, హంస వింశతిలోను నూటయెన్మిది తిరుపతుల పేళ్లు నిందున్న తీరుననుసరించియున్నవి. ఏతన్ముద్రణానంతర మా పేళ్ల నందుఁజూచితిని.

ఇందు వచనరచనారీతిలో ననంతుఁడు చెప్పిన గద్య(వచన) లక్షణము చక్కఁగా సరిపడినది. లక్షణశిరోమణికారుని 'విన్నపము' రచన కీవచనములు మంచిలక్ష్యము లనఁదగును. దూరాన్వయము, సమాసక్లేశము ననుప్రాసవిన్యాస పరిశ్రమము నిందులేవు. సూటిగా మనసున నాటునట్లు భావము లున్నవి. కొన్ని వచనములు టాగోరుగారి గీతాంజలీ రచనములఁ దలపించు నవిగాఁగూడ నున్నవి. కృష్ణమాచార్య సంకీర్తనములు సరిగానిట్టివే వీనికిమూలకల్పములే కాని, యందు భాషా ప్రాచీనత యింతకంటె విస్పష్టముగా గోచరించుచున్నది. ఈ వచనములను రాగతాళములతోఁ బ్రాచీనకాలమునఁ బలువురు పాడెడివారుగావలయు; కవియే భావానుగుణముగా వీనికి రాగతాళములఁ గల్పించినాఁడు.

## తాళ్లపాకవారు

ఏతద్ గ్రంథకర్త తాళ్లపాక పెద తిరుమలాచార్యుఁడు నందవరీక స్మార్తబ్రాహ్మణుఁడంటిని. తాళ్లపాక నేటి రాజంపేట తాలూకాలో నున్నది. అది వీరి నివాసగ్రామము. ఈకవి తండ్రి.

## అన్నమాచార్యుఁడు.

ఈతఁడు వైష్ణవమతమును స్వీకరించినవాఁడు గొప్పభక్తుఁడు. కవి. మహిమలుగలవాఁడు. ఈతఁడు తొంబదియాఱేండ్లు జీవించెను. ఇతనికుమారుఁడగు పెద తిరుమలాచార్యుని కోర్కెచొప్పున నీ యన్నమాచార్యుఁడు దినమునకొక్కటిదాని కేనితక్కువకాని చొప్పునగేయములు రచించుచు శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధిని సంకీర్తనము చేయుచుండు వాఁడట! ఈతనికిఁ బదునాఱవయేట స్వామి ప్రత్యక్షమయ్యెనట! తదాది యెనుబది యేండ్లదాక నీతఁడు సంకీర్తనములు రచించుచునే యుండెను.

ఈతనికిఁ సంకీర్తనాచార్యుఁడని ద్రావిడాగమసార్వభౌముఁడని, పంచమాగమచక్రవర్తియనిబిరుదులు. శ్రీవేంకటేశ్వరస్వామికీతఁడు మామ. అలమేలుమంగాంబ కీతఁడు తండ్రి వరుసవాఁడు. ఇతని సంకీర్తనలను వినిన చెవిని మఱొకరి సంకీర్తనముల విననొల్లనని శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రతిజ్ఞగావించెనట ! ఈతఁడు రచించిన గ్రంథములు, ౧ అధ్యాత్మ సంకీర్తనలు ౨ శృంగారసంకీర్తనలు ౩ శృంగారమంజరి ౪ సంకీర్తన లక్షణము (సంస్కృతము ; ఇది దొరకలేదు) ఈకవికి సంబంధించిన చరిత్రము శాసనాదులందుఁగాన రాదు. [1]కాని, తాళ్లపాక చిన్నన్న ద్విపదకృతిగా నితనిచరిత్రము రచించినాఁడు. ఈతని కుమారుఁడు.

## [2]పెద తిరుమలాచార్యుఁడు.

ఈతఁడే ప్రస్తుత గ్రంథమగు శ్రీవేంకటేశ్వర వచనములకుఁగర్త. శ్రీ తిరుపతి దేవస్థానముననున్న రాగి రేకులమీఁద నీ వచనములు తిరుమలాచార్యరచితములని గ్రంథారంభమునఁ జెప్పఁబడినది. ఈతఁడు మహైశ్వర్యమహితుఁడుగావెలసెను. శ్రీ వేంకటేశ్వరస్వామి కీతఁడనేక కైంకర్యముల జరపించెను. శ్రీస్వామి యీతనితోఁ దరువాతి మూఁడు తరములదాఁక ప్రత్యక్షమును, నేడుతరములదాఁకఁ బరమపదమునునను

1. ఇది తిరుపతి ఓరియంటల్ యిన్స్టిట్యూట్ లైబ్రరిలోనున్నది.

2. ఈతఁడు పెరియ తిరుమలాచార్యుఁడని, పెద తిరుమలాచార్యుఁడని, పెద తిరుమలయ్యయని, తిరుమలార్య దేశికుఁడని పలు తెఱఁగుల జేర్కొనఁబడుచున్నాఁడు.

గ్రహించెనట! ఈతని యితర కృతులు ౧ శృంగార సంకీర్తనలు ౨ శృంగారదండకము ౩ చక్రవాళమంజరి ౪ శృంగారవృత్తశతకము ౫ శ్రీవేంకటేశోదాహరణము ౬ నీతి సీసశతకము ౭ సుదర్శనరగడ ౮ రేఫఱకారనిర్ణయము ౯ ఆంధ్ర వేదాంతము (ద్విపద) ౧౦ ఆంధ్ర హరివంశము, ౧౧ భగవద్గీత (వచనము) ౧౨ శ్రీవేంకటేశ్వర ప్రభాత స్తవము, ఈతనికి వేదాంత ప్రతిష్ఠాపనాచార్యుఁడని బిరుదు. స్వామి కీతఁడు జరపినకైంకర్యముల సారము[1] :—

పెద తిరుమలయ్యంగారు క్రీ. 1517 నుండి, 1552 దాఁక శ్రీవేంకటేశ్వరస్వామివారికిని ఇంకనితరస్థలములలోని దేవరలకును, నైవేద్య ప్రసాదోత్స వాదికైంకర్యములకై పదునాల్గు గ్రామముల నర్పించిరి. ఆ గ్రామములు, అచ్యుతరాయడు, బుక్కరాయ తిమ్మరాజు మొదలగువారు తనకు దానముచేసినవి. అంతేకాక యెన్నోవేల పణము లనుగూడ నాయా పుణ్యకార్యములకై వారర్పించిరి. తిరుమలమీఁదఁ దమ సంకీర్తనములు చెక్కించిన రాగిరేకులు దాచియుంచిన సంకీర్తన భాండారము రక్షించుటకై యర్చించుటకై కూడ గొప్పదానములు చేసిరి. తండ్రిగారును దామును రచించిన సంకీర్తనములను స్వామివారి సన్నిధిని ప్రతిదినము పాడుటకై యిద్దఱు వైష్ణవుల నియోగించిరి. స్వామివారి కోనేటిని గోపురములను మంటపములను, బెక్కింటిని చక్కఁ బఱిపించిరి. కోనేటి నడుమ నీరాడు మంటపమును గట్టించిరి. ఇట్లెన్నో పుణ్యకార్యముల జరిపిరి. తండ్రివలె నీతఁడుగూడఁ బూర్ణపురుషాయుష జీవితముగల్గిన ధన్య చరిత్రుఁడయియుండును. ఏలనఁగా నీతనితండ్రి క్రీ. 1408 నుండి క్రీ. 1503, దాఁకజీవించెను. అన్నమాచార్యునకీతఁ డఱువదవయేఁట జన్మించినాఁడనుకొన్నను, నీతని జన్మకాలము క్రీ. 1468 యగును. అప్పటినుండి 1552 తర్వాతిదాక నీతఁడు జీవించినాఁ డనఁగా నెనుబదియేండ్లించుమించుగా జీవించినవాఁడగును. ఈతనికి

---

1 తాళ్లపాకవారి చరిత్రాంశములు శ్రీసాధు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ప్రకటించిన తిరుపతి దేవస్థానము ఎపిగ్రాఫికల్ రిపోర్టు (పేజీలు 382–291) ననుసరించి వ్రాసినవి.

సాతాని వైష్ణవు లిద్దఱు శిష్యు లుండెడివారట! వారుకూడ నీతనివలె స్వామికిఁ గొన్ని కైంకర్యములు జరిపిరి. ఈతనికుమారుఁడగు చిన్నన్న (చిన తిరువేంగళనాథుఁడు) రచించిన యన్నమాచార్య చరిత్రమున నన్నమాచార్యుఁడు వైఖానస వైష్ణవుఁడయినట్లున్నది.

ఈతనికిఁ గుమారులు ౧ చిన తిరుమలార్యుఁడు ౨ అన్నయ ౩ పెద తిరువేంగళనాథుఁడు ౪ తిరువేంగళనాథుఁడు (చిన్నన్న) ౫ కోనేటి తిరువేంగళనాథుఁడు.

ఇందు నాల్గవ కుమారుఁడయిన తిరువేంగళనాథుఁడు రచించిన యష్టమహిషీకల్యాణమున వీరి వంశవృక్షమిట్లున్నది.




1. మూలపురుషుఁడు. శృంగార సంకీర్తనాది గ్రంథకర్త.

2. వేంకటేశ్వరోదాహరణాది బహుగ్రంథకర్త. ప్రకృత గ్రంథకర్తకూడ.

3. సంకీర్తన లక్షణాదిగ్రంథకర్త.

4. అష్టమహిషీకల్యాణ పరమయోగివిలాసోపాపరిణ యన్న మాచార్యచరిత్రగ్రంథకర్త.

5. ఆంధ్రామరుకామరవ్యాఖ్యా కావ్యప్రకాశవ్యాఖ్యా కర్త.

6. శకుంతలా పరిణయము, శ్రీ పాదరేణుమాహాత్మ్యము. ఇతనికృతులు.

ఈ తాళ్లపాకవారికి రేవణూరివారు జామాతృ వంశమువారు. రేవణూరివేంకటకవి తన శకుంతలాపరిణయమున నిట్లు చెప్పినాఁడు.

శ్రీవత్సాన్వయరేవణూరికులజుఁ శ్రీపాదరేణుప్రభా
సౌవర్ణస్ఫుటకావ్యకల్పకకవిఁ సంకీర్తనాచార్యపు
త్రీవంశోత్తము నందవైదిక బుధాతిప్రోక్త వృత్తిస్వయం
భావుం దిర్మలకొండయార్య సుతు శుంభద్వేంకటాభిఖ్యునిఁ.

శ్రీవేంకటరమణునకు ...... సమర్పణంబుగా సమర్పించెద నిహపరసాధనములకు నింక నేమి కొదవ యదియునుంగాక యస్మహాదేవుండు మదీయమాతా మహవంశశిఖారత్నం బగునన్నయాచార్యునకు జామాతరుం డనిపించుకొని భవదీయ సంకీర్తనంబు లాలించినకర్ణంబుల నితర సంకీర్తనంబు లాలించనని ప్రతిజ్ఞఁగావించె తత్తనూజుండగు పెద్ద తిరుమలాచార్య బిడౌజునకుఁ త్రిపురుషపర్యంతముగాఁ బ్రత్యక్షంబును, సప్తపురుషపర్యంతముగా మోక్షంబు నొసంగెదనని వరమిచ్చె; సచ్చరిత్రులగు దదీయపౌత్రులకుఁ జినతిరుమల దీక్షితాన్నయాచార్య తిరువేంగళనాథ కోనేటి తిరువేంగళనాథ వెంగళార్యులకు విచిత్రముక్తాతపత్రరత్నకిరీట ముద్రికా ప్రచండమణిమండిత మకరకుండలోత్కరాహాకరదీపికా పాదుకాది బహూకరణంబుల గరుణించె; విశేషించియు నత్తిరువేంగళనాథుండు సంకీర్తనంబుఁ బాడిన నాడం దోడంగె నేతత్ప్రకారంబున నస్మహామహునకుఁ బాండవ సహాయుండైన శ్రీకృష్ణదేవునింబలె సహాయుండై .........ధన్యుడనయ్యెదనని విశ్వయించి;"

ఈ గ్రంథమును బట్టిచూడఁగా, నీవేంకటాచార్యకవి సంకీర్తనాచార్యుఁడగు నన్నమాచార్యునికి దౌహిత్రవంశములోనివాఁడని యేర్పడును.

రచనము జాలఁదర్వాతిదిగానే యున్నది. కాని యీతనిదేయగు*. శ్రీపాదరేణుమాహాత్మ్యముగద్య మాతఁడు సంకీర్తనాచార్యుని మనుమఁడే యనఁదగి నట్లున్నది :— ఇవి సంకీర్తనాచార్య దౌహిత్ర రేవణూరి తిరుమల కొండ యాచార్యపుత్ర వేంకటాచార్య ప్రణీతంబైన శ్రీపాదరేణుప్రభావంబను నిస్సహాయ కావ్యంబునందు రంభాపురందర సంవాదంబనునది తృతీయోల్లాసము. ఇది తప్పయియుండునేమో! 'సంకీర్తనాచార్యదౌహిత్రవంశ్య' అని యుండఁదగునేమో!

## గ్రంథ ముద్రణము

ఇప్పటి కిరువది యేండ్ల క్రిందట నేనీ వేంకటేశ్వర వచనములను ప్రాచ్యలిఖిత పుస్తక శాలలోని ప్రతులఁబట్టి యుద్ధరించి 'భారతి' పత్రికలోఁ బ్రకటింపఁ బూనితిని. అప్పటికి తాళ్లపాకవారు రచించినవయియుండునని నే ననుమానించితినేకాని దాని కాధారమేదియు నాకుఁ గానరాలేదు. అప్పుడు ప్రకటించుటలో నే నిట్లు వ్రాసితిని.

"ఇవి తాళ్లపాకవారు రచించినవై యుండవలెను. వీనిలో విష్ణుభక్తి యూటలూరుచున్నది. ప్రాచీనములలో నింత రసవంతము, భక్తిభరితము నగు వచనరచన యసాధారణముగా నున్నది. కృష్ణమాచార్య సంకీర్తనములు శంకర వచనములు మొదలగునవి వ్రేళ్లలెక్కకుఁ జాలినవి, యిట్టివి, కొన్నియున్నవి. వీని నెల్లఁ గ్రమముగా వెల్లడింపఁ గోరికపడుచున్నాను. సహృదయు లివి చవిగొందురుగాక!"

(భారతి - క్రోధన వైశాఖము)

'భారతి'లో నిట్లు ప్రకటించుచుండుటఁ జూచిన సహృదయులు కొందఱు నన్నావచనములెల్ల గ్రంథముగా ముద్రింపఁగోరిరి. అట్లే నేను వాసిని మదరాసులో 'నాంధ్రపత్రికా ముద్రణాలయము' ననే ముద్రింపఁబూనితిని. నూటయిర్వది వచనములు 80 పుటలు ముద్రితములయ్యెను. అప్పుడు తిరుపతి శ్రీవేంకటేశ్వర దేవస్థానోద్యోగులొక

* ఇది తిరుపతి ప్రాచ్యపరిశోధనశాల లైబ్రరిలోనున్నది. కృత్యవతరణిక లేదు.

రిద్దఱు నామిత్రులాగ్రంథము తిరుపతి దేవస్థానమువారు ముద్రించుచుండుట నా కెఱింగించిరి. రాగిరేకులపైఁ గవికాలమునఁ జెక్కఁబడియున్న యావచనముల నుద్ధరించి దేవస్థానమువారు ముద్రించునప్పుడవి మిక్కిలి నిర్దుష్టముగా నుండఁగలవని, వారు ముద్రించుచుండఁగానే నాత్రపడి ముద్రించుట వ్యర్థమనివెఱచి యాగ్రంథము బయల్పడిన తర్వాత నా ప్రకటన విషయము యోజించుకొన వచ్చునని యుపేక్షించితిని. అచ్చుపడిన యాఫారము లెల్ల నాంధ్రపత్రికా కార్యాలయముననే యుండెను. ౧౯౩౫ తర్వాతనే తిరుపతి దేవస్థానమువారి ముద్రణము ముగిసెను. అటుతర్వాతఁ గొన్నాళ్లకుఁ జూతునుగదా! అందు నలువదియేడు వచనములే ముద్రితములయి యుండెను. మఱిమూఁడేండ్లకు నేను తిరుపతివచ్చి పరిశీలింపఁగా దర్వాతి వచనములయునికి యెఱుఁగ రాలేదు. అవి యహోబలముననో శ్రీరంగముననో యడఁగి యుండఁబోలును! ప్రాచ్యలిఖితపుస్తకశాలలోను, దంజావూరి సరస్వతీ భాండాగారములోను నున్నవచనములు సమకూర్చి చూడఁగా ౧౭౫ వచనములున్నవి. ఇంకఁగొన్ని లోపించియు నుండఁబోలును! నేను రెండు లైబ్రరీలలోని వచనములు సమకూర్చికొని యుంటిని. తిరుపతి దేవస్థానముద్రణము తప్పులతో నసమగ్రముగానేయుండెను. ఈ విషయము వివరించి తెలుపఁగా నప్పుడు శ్రీవేంకటేశ్వర ప్రాచ్య విద్యాలయమున డైరెక్టరుగానున్న సరస్వతీ హృదయాలంకారులు శ్రీమాన్ యమ్. కృష్ణమాచార్యులుగారు నా ముద్రణము పూరింపఁగోరిరి. వెదకఁగా మదరాసులోని యచ్చుఫారములెల్లో యెక్కడో చెల్లిపోయినట్లు తెలిసెను. నాదగ్గఱ మిగిలియున్న యచ్చుమచ్చుఫారములబట్టి ౧౨౦ వచనముల మరలనిపుడుముద్రించుట, కడమయముద్రితములఁబూరించుట, జరపితిని. ఇట్లుదీనిని వెల్లడింపఁజూచునాఁటికి శ్రీకృష్ణమాచార్యులుగారుకీర్తిశేషులయిరి. శ్రీమాన్ పరవస్తు వేంకటరామానుజస్వామి యమ్. ఏ.

డైరక్టరుగారు దీని ముద్రణ యత్నము సాగించిరి. ఇట్లు శ్రీస్వామి వారి స్తుతిగ్రంథము శ్రీస్వామివారి యాస్థానకవిరచించినది, యీ నాఁటి కిట్లు శ్రీస్వామివారి యాస్థానిలోనే ప్రకటితమగుట సంఘటిల్లి నది. ఆనాఁటి తాళ్లపాక వంశమువారు మహనీయులు. వారి రచనము లింకనెన్నో ప్రకటితములు గావలసియున్నవి. వారు శ్రీస్వామివారి కెన్నో కైంకర్యముల జరపిరి. తనభక్తులగు నట్టి యా మహనీయుల సత్కృతులను శ్రీస్వామివారు సంరక్షించుకొందురనియే యాశించు చున్నాఁడను.

శ్రీవేంకటేశ్వర ప్రాచవిద్యా<br>పరిశోధనాలయము,<br>తిరుపతి<br>తారణ - ఫాల్గునము.

వేటూరి - ప్రభాకరశాస్త్రి.



# శ్రీ వేంకటేశ్వర వచనములు.

---

## 1

శ్రీ వేంకటగిరిదేవా! నా దేహంబు నీ వుండెడి నిత్యనివాసంబు; నా జ్ఞానవిజ్ఞానంబులు నీ యుభయపార్శ్వంబుల దీపంబులు; నా ముకుఁజెఱమలయూర్పులు నీ యిరుదెసలం బట్టెడి యాలవట్టంబులు; నా మనోరాగంబు నీకుఁ జెంద్రకావి వలువ; నీకు మ్రొక్క నెత్తిన నా చేతులు రెండును మకరతోరణంబులు; నాభక్తియె నీకు సింహాసనంబు; నామేనం బొడమిన పులకలు నీకు గుదులుగ్రుచ్చి యర్పించిన పూదండలు; నే నిన్ను నుతియించిననుతుల యక్షరరవంబులు నీకు భేరీభాంకార ఘంటా నినాదంబులు; నా పుణ్య పరిపాకంబులు నీకు నైవేద్యతాంబూలాదులు; మదీయ నిత్య సేవా సమయనిరీక్షణంబు నీకు సర్వాంగంబుల నలందిన తట్టుపునుంగు; నా సాత్త్విక గుణంబు నీకు ధూపపరిమళంబు; నీవు దేవుండవు; నే నర్చకుండను. ఈరీతి నిత్యోత్సవంబు నాయందు నవధరింపవే శ్రీ వేంకటేశ్వరా! మఱియును;

## 2

నందకాయుధధరా: నీ యాయుధంబులకు జయజయ; నీ వాహనంబులకు శుభమస్తు; నీ పరివారంబులకు క్షేమంబు గోరెద; నీకళ్యాణగుణంబులకు నిరంతరాభివృద్ధియగుఁగాక; నీ సత్త్వంబులకు శోభనపరంపరావాప్తి యొసగవలయు; నీ దేవులకు మంగళ మహాశ్రీలగు; నీమహిమకు ననంతవివిధార్చనము; నీ భుజాబలమునకు నపరిమిత స్తోత్రము; నీ చక్కఁదనంబునకుఁ బుష్పాంజలి; నీ యుదారతకు శరణంబు; నీ శ్రీవత్సకౌస్తుభాది చిహ్నంబులకు సంతతప్రార్థన; నీపాదం

ఋలకు సాష్టాంగ నమస్కారంబు చేసెద. ఏమినిమిత్తంబు చేసెద వంటివా ? నాలుగు యుగంబుల ధర్మంబులు, సకలజంతువుల పరిణామంబులు, కమలాసనాదిదేవతల బ్రదుకులు, నీ మూలంబునఁ గావున నీవు శుభంబున నుండుటే మేలు ; శ్రీ వేంకటేశ్వరా !

## 3

అలమేలుమంగాపతీ ! నిన్ను వెదకి వెదకి కనియెద మన నే మెంత వారము ? నీ సుద్దులు పెద్దల నడిగి వైకుంఠవాసుండ వనఁగా నీ యూ రెఱింగితిమి. విష్ణువాసుదేవ నారాయణ నామంబులు విని నీ పే రెఱింగితిమి. శరణాగతరక్షకత్వము నీకుఁగలదనఁగా నీ గుణం బెఱిఁగితిమి. నీలమేఘశ్యామ లక్షణంబులు గలుగంగా నీవర్ణం బెఱింగితిమి. శ్రీవత్సకౌస్తుభాది చిహ్నంబులుచూచి నీగుఱు తెఱింగితిమి. శేషాచల నివాసంబుకతన నీ గోత్రం బెఱింగితిమి. పురుషోత్తమఖ్యాతిచేత నీ పౌరుషం బెఱింగితిమి. వేణునాదవినోదివని చెప్పంగా నీవంశంబెఱింగితిమి. మత్స్య కూర్మ వరాహ నారసింహ వామనాద్యవతారంబులు విని నీ పుట్టు వెఱింగితిమి. నీకు మ్రొక్కెదము. అన్నింట నధికుండవని నిన్నుం గొలిచితిమి. ఇంక నీ మహిమలం గొనియాడెదము. పాడెదము. శ్రీ వేంకటేశ్వరా !

## 4

క్షీరాబ్ధిశయనా ! కమలంబు సూర్యుని కెదురు సూచినయట్లు నా హృదయ పద్మంబు రవిమండలమధ్యవర్తి వైన నీ కెదురు చూచుచున్నది. కుముదంబులు చంద్రోదయం బపేక్షించినట్లు నా కన్నుం గలువలు భవద్దివ్య ముఖ చంద్ర దర్శనం బపేక్షించుచున్నవి. మయూరంబులు మేఘాగమనంబునకుం జెలంగినట్లు నా మనోమయూరంబు నీల మేఘవర్ణంబైన నీ తిరుమేను దలంచి యానందించుచున్నది. ముత్యపుఁ జిప్పలు స్వాతిచినుకులకు నోరు దెఱచినట్లు నావదనశుక్తి మీ పాదతీర్థంబునకు వికసించుచున్నది. సర్పంబులు గానంబులు గోరి చొక్కి పడగ లెత్తియాడినట్లు నా వీనులు మీ కథల నాలకించుచున్నవి. నీవు పరాత్పర

మూర్తివి; నేను ప్రకృతిసంబంధంబులైన యంగంబులు ధరియించిన వాఁడ; నది యెట్లు గూడదు ననవలదు. ఆ ప్రకృతికి నీవు చైతన్యమవు. ఈ చుట్టఱికము తొల్లి కలుగఁగానే దీని కీయనురాగము గలిగి యున్నది. కన్నెఱుఁగకున్నఁ గడు పెఱుంగు నండ్రు లోకులు. ఇంతియకాని నిన్ను నెఱుంగ నే నెంతటివారము. నా యాస విన్నవించితి నింతియు కాని నిన్ను నేఁ గక్కసించినవాఁడఁ గానుజుమీ. శ్రీ వేంకటేశ్వరా!

# 5

దామోదరా! సకలతీర్థంబులు మీ కోనేటనే యాడితి. సకల తిరుపతుల విగ్రహంబులు మీ మూర్తియందే సేవించితి. సకలదానంబులు మీకు నొకకాసు కానుకవెట్టినయందె ఫలియించె. విహిత యజ్ఞాదికర్మంబులు మీ కైంకర్యంబుననే తీర్చితి. జపంబులన్ని మీ తిరుమంత్రమందె జపించితి. వేదపాఠంబులు మీ సంకీర్తనమందె యభ్యసించితి. తపములు వైష్ణవాచారముల లభించె, నింక నేమిటం గడమలేదు. నా హృదయకమలంబున నీ వున్నాఁడవు. నా మనంబు శోధింపం బనిలేదు. నాణెంబైన టంకంబునకు వట్టంబు గొనరాదు. భండారంబునం బడినలెక్కకుఁ బరులు చాడిచెప్పం జోటులేదు. ఆరీతి నే నీసుముద్ర ధరించినవాఁడ, నగుటంజేసి, యేదోషంబులు నన్నుఁ బైకొనకుండఁజేసి, రక్షింపవే శ్రీ వేంకటేశ్వరా!

# 6

హృషీకేశా! యేను బెక్కు జన్మంబు లెత్తియలసి పూర్వజాతిస్మరత్వంబు గలిగి యీపుట్టువున నిన్నుం గొలువవలయునని తలంచిన యుద్యోగంబునఁగాదు; శృంగారంబునకు నొసలఁ దిరుమణి వెట్టితి. మఱియు నాయుబ్బరితనంబున నీ సంకీర్తనలు నేర్చుకొంటె, నీ రీతి ప్రయత్నంబు లేక ఘునాక్షర న్యాయంబున నాచేఁతలు నీ దాస్యంబున కెక్కె. నీవు చక్కని మూర్తివిగావున నీ విగ్రహంబు నా యింటిలోపల నిడికొని నా వేడుకలకు దేవరంగాఁ గొల్చితిని. నా మీఁద

దయదలంచి యకారణబంధుండవై యొక్కొక్క యుపాయంబున నన్ను నీడేర్చుకొనుటకు నీమీఁదభక్తి పుట్టించితివి. నా జడత్వంబును నీ సర్వజ్ఞత్వంబును నిందులోనే చూపితివి. భళిభళీ శ్రీ వేంకటేశ్వరా!

# 7

కమలనాభా! మోక్షంబు గోరెడువారికి నీపై నిరంతర ధ్యానంబు గారణంబు. ఈరీతి ధ్యానంబు సేయుటకు నిర్మలంబైన మనంబు గారణంబు. నిర్మలంబైన మనంబునకుఁ బంచేంద్రియ నిగ్రహంబు గారణంబు. పంచేంద్రియనిగ్రహంబునకు శరీర శోషణంబైన తపంబు గారణంబు. తపంబునకు బాహ్యప్రపంచ విముక్తియైన వైరాగ్యంబు గారణంబు. వైరాగ్యంబునకు సంగరాహిత్యంబు గారణంబు. ఇన్ని మార్గంబులు నీ కలియుగంబున నెవ్వరికి సిద్ధించును? నీకు శరణుసొచ్చి నామంబులు పఠియించిన నీవే దయదలంచెదవుగాక. శ్రీ వేంకటేశ్వరా!

# 8

గోవిందా! పుట్టిన యపుడే యేయేజాతి పక్షులకాయా విధంబులం గూఁతలుబెట్ట నేర్పినవా రెవ్వరు? మృగంబులు గర్భంబులలో నుండి వెడలి తల్లులచన్నులం గుడువఁ గణంగుబెట్లు? పశువులు కసువునెుసం గెడి చందం బెట్టిది? నానావిధ వృక్షంబులు మొలచినయపుడు తమ తమ యాకారములు పుష్పదళములు గలిగి తతికాలం బెఱింగి చెలంగు టెట్లు? అన్నియును నీ యాజ్ఞారూపంబులైన ప్రకృతిభావంబులె. మేమును నీ రీతినే నీకల్పితములైన దేహంబులు మోచుచున్న వారము; మానేర్పునేరములు, మాస్వభావంబులు, మాసంసారకృత్యంబులు నీ కల్పితములైన, నీ ప్రభావంబులే. మమ్ముఁ దప్పు లెంచఁ బనిలేదు. శ్రీ వేంకటేశ్వరా!

# 9

పరమాత్మా! ప్రపన్నుండనైన యతండు జీవితకాలంబు మీ లీలావిభూతిలో మీ కళ్యాణగుణంబు లనుభవించి భూమి పావనంబుగా

సంచరించి, అర్చిరాది గమనంబునం బరమపదంబునం బొందెడునాఁడు నాభినుండి ప్రణవభూరినినాదంబు చెలంగ నీతోడం గూడి నిన్ను సేవించు కొని, హృదయగుహనుండి వెడలి, వాగాదీంద్రియంబులను మనంబుతోఁ గూర్చి, మనంబుఁ బ్రాణంబులఁ దగిలించి, ప్రాణంబుల జీవునిం గలపి, జీవుండైన తన్నుఁ బంచతన్మాత్రల నంటించి, యాజీవప్రకృతి నీయందుం బాదుకొల్పి నీయాధారంబున సుషుమ్నానాడి భేదించి, మూర్ధన్యనాడి యైన బ్రహ్మరంధ్రంబున సూర్యకిరణంబులతో నిర్గమించి యగ్న్యహ శ్శుక్లపక్షోదగయనాబ్దాభిమాని దేవత లనియెడి యాతివాహిక గణంబు లొండొకరిచేతి కందీయఁగా వాయువుఁ బ్రవేశించి సూర్యమండలంబు సొచ్చి చంద్రమండలంబు సొచ్చి మెఱుంగై యున్న విద్యుత్పురుషుని సహాయంబున వరుణేంద్ర బ్రహ్మలోకంబులు గడచి సువర్ణబ్రహ్మాండ కటాహంబు భేదించి పృథివ్యప్ తేజోవాయ్వాకాశాహంకార మహత్తు లనియెడి సప్తావరణంబులనుం దాఁటి మూలప్రకృతి మీఱి విరజానది యుత్తరించి తేజోరాశియైన బ్రహ్మంబనియెడు నీ స్వరూపంబుం బ్రవేశించునట. ఎటువంటి క్రొత్తైన కథ వింటిమి. అహాహా! శ్రీ వేంకటేశ్వరా!

## 10

మురహరా! ఆర్తులకు నభయంకరుండవు. సంసార సర్పదష్టులఁ దేల్చ గరుడధ్వజుండవు. అజ్ఞానతిమిరస్థులకు సూర్యనారాయణుండవు. పాపమను మొసలిచేతఁ బట్టువడిన వారి బాధలు మాన్పఁ జక్రాయుధుండవు. దారిద్ర్యదావానలంబార్ప గంగాజనకుండవు. దేవతలపాలింటి కల్పవృక్షంబవైన యశ్వత్థనారాయణుండవు. యోగీశ్వరులపాలికి చింతామణివైన కౌస్తుభవక్షుండవు. భక్తజనపాలకలక్ష్మీనాథుండవు. నీ ప్రతాపం బేమని వర్ణింపవచ్చు? నీ కల్యాణగుణంబు లెన్నియని లెక్కపెట్టవచ్చు? నీ మహిమ లేమని తెలియవచ్చు? మేము మా నోరికొలందిఁ గొంత చింతించెదము. చిత్తగింపవే శ్రీ వేంకటేశ్వరా!

## 11

గరుడధ్వజా! యేమని చెప్పెడిది నీ ప్రభావంబు? నీ నాభికమలంబునం బుట్టెనట; విరించి మీ మహిమం దెలియ శక్తుండు గాఁడట! నానావేదంబుల నీ మహిమలు చెప్పొనట; నీ మూర్తి కడగుఱుతుం గానవట! రవిచంద్రులు నీ నయనంబు లట; నీ యపార తేజోమహిమంబు తెలియంగలేరట! ఇంద్రాది దేవతలు నీ యాజ్ఞాధారులట; యొక్కొక్కమాఱును నీతోఁ గినిసి నిన్నెదిరించలేక నీ శరణు వేఁడుకొందురట! పంచమహాభూతంబులు నీ ప్రకృతిగుణంబు లట; నీ స్వభావంబు లట్టివి యని తెలుపఁజాలవట! సముద్రంబులు నీ పాన్పట; నీ గుణంబుల లోఁ తెలియంగవట! మునులు భవదీయ స్వరూప సూచకవాదులట; నీ మాయ దాఁటనోపరట! చరాచర జగత్తు నీ సృష్టియట; నిన్నుం జూపి చెప్పనోపదట! నా శక్తి యెంత? నేనెంత? నే నీశ్రీపాదంబులు గతియని యుండఁగా నీవే దయదలంచెదవుగాక! శ్రీవేంకటేశ్వరా!

## 12

గోపికావల్లభా! నేఁ దలపోయంగా ఫలియించిన మేలు, మఱియు నే వెదకంగా దొరకెడు పదార్థంబులు, నేఁ గోరంగా వచ్చు లాభంబు, నేఁ జదువంగాఁ దెలిసినయర్థంబు, నే గడియించుకొనంగా సిద్ధించిన ధనంబు, నా నేర్పువలనఁ దెచ్చుకొనియెడి సుఖంబు, నా చేతులఁజేసిన పుణ్యంబు, నా తపోబలిమిం గైకొను లోకంబు, నా పురాకృతఫలంబు, నా మనోరథంబు, నీవే. నా నుదుట బ్రహ్మదేవుండు వ్రాసినవ్రాలు, నే జన్మించిన జన్మకారణము, నా యంతరంగంబులో నున్న మూర్తి, నీవే సుమీ! నా కలిమి విన్నవించితి. శ్రీవేంకటేశ్వరా!

## 13

పీతాంబరధరా! నీసాలోక్యంబు నాకు నీ భూలోకంబుననే సిద్ధించి యున్నది; సామీప్యంబు హృదయకమలంబున లభియించె;

సారూప్యంబు నీ ధ్యానంబున నిలిచినది; సాయుజ్యంబు నిద్రాసమయంబునంగలదు; నీకు శరణుసొచ్చినం బాపవిముక్తి సేతునంటివి గావున జీవన్ముక్తి సమకూడె. నీవు నన్నెడబాయకుండుటంజేసి సదానందానుభవంబు గలిగె. నీపై భక్తియొసంగినందువలన జన్మశుద్ధియయ్యె. నాలుకకు మీ నామామృతం బొసగినకతన నమృతపానంబు దొరకె. మఱియు నీ దాసులసంగతిని యోగము నలవడె. ఇంక నిన్నడిగెడిదేమి? అన్నిటం గృతార్థుఁడనైతిని. శ్రీ వేంకటేశ్వరా!

## 14

శార్ఙ్గాయుధధరా! నిన్ను భజించి యేమియైనను గోరి యడిగెద నంటినేని నీకంటె నుత్తమవస్తువు లెక్కడ నున్నవి? నీయందే మూర్తిత్రయంబును, ద్వాదశాదిత్యులును నేకాదశరుద్రులును, నవబ్రహ్మలును, నేకోనపంచాశన్మరుత్తులును, వసువులును, దిక్పాలకులును, మునులును, సిద్ధగంధర్వపదంబులును; అణిమాద్యష్టైశ్వర్యంబులును, చతుర్దశభువనంబులును, కులాచలదిగ్గజ మహానాగములును, సింధుగంగా నదీ ముఖ్యతీర్థంబులును, సకల సామ్రాజ్యంబులును నున్నవి. పరమపదంబున్నది. నీవుగలచోట నన్నియుం గలవు. నిన్ను నాత్మందలంచిన నాకు సకలసౌఖ్యంబులుం గలవు. శ్రీ వేంకటేశ్వరా!

## 15

నీలమేఘశ్యామలా! అణువులకు నణువవు; మహత్తులకు మహనీయుండవు; ప్రకృతిపురుషులకుం బరమాత్మవు; మూఁడు మూర్తులకు మూలమవు; చరాచరంబులకు సాక్షివి; ఊహించిచూచిన నొక్కండవే దేవుండవు; ఏర్పఱిచిచూచిన ననంతుండవు; తలఁచిన నభేద్యతత్పదుఁడవు; విచారించిన నిర్గుణుఁడవు; వినం గణంగినఁ గల్యాణగుణుండవు; కన్నులం జూచిన సాకారమవు; స్వరూపవ్యాప్తిని నిరవద్యుండవు; స్వాతంత్ర్యంబున జీవచైతన్యమవు; భక్తిపరులకఁ

ప్రసన్నుండవు ; తుది విచారించిన జగత్కర్తవు ; ఇట్టి నీ గుఱుతు యంగ వచ్చునయ్యా ! పెక్కురూపంబులు గలవాఁడవు ; పెక్కునా బులు గలవాఁడవు ; వేదవాదులకును నగోచరుండవు ; నిన్నుం కొలువనేరము, నీవే కరుణించి కావవే శ్రీ వేంకటేశ్వరా !

## 16

కోనేటినిలయా ! విరజానదిపర్యంతంబును విడువని ప్రాకృతదేహం మోచిన జీవులు తమతమసామర్థ్యంబుల జీవన్ముక్తుల మయ్యెద నెట్లువచ్చు ? ఇట్టి ప్రకృతిసంబంధంబున వచ్చిన యింద్రియంబు జయింపనిచ్చు ? అందులకుఁ గారణంబైన మనస్సు నేరీతి ని బగును ? తన్మూలంబునం జేసినకర్మంబు లేల శాంతింబొందు ? న నాఁ గా కేమి ! ఎందులకు నేలా భయంబునొంద ? నిందులకుఁ గా బిన్నివిధంబులం బ్రవర్తిల్లెడు నీమాయ. నిన్నుం గొల్చినవారి మాయ నుపసంహరింపనేర్తువు. తాళముచే నొకవంక నుండ దలుపుతోఁ బెనంగఁగా నేల ? ఇది యెఱింగికదా మున్నిట్టివా కొందఱు నీదాసులయి నిన్నుం బొగడియు, నీకు శరణుసొచ్చిర మహాత్ములయిరి. ఏము నదియె యుపాయంబని యెఱుంగుకొం శ్రీ వేంకటేశ్వరా !

## 17

అప్రమేయా ! భువి నెన్ని మాయోపాయంబులు గలిగిన నీ దాస నకు నీడురావు. చేయవచ్చు బహువిధపుణ్యంబులు; నీవు దే వని తెలియు విజ్ఞానమునకు సరిగావు. నేనం దగు యోగాభ్యాసంబ ఇవి నీభక్తితో సరిగావు. ఉండుఁగా కేమి పెద్దతనంబులు కొంద నీ శరణాగత ధర్మంబుతోఁ బురుణింపరావు. వెలయుచున్నవి శబ్దంబులు; నీతిరుమంత్రస్తోత్రంబువలె ఫలంబు లొసగవు. ఇది యె గుదు. ఇంక నానావిద్యలు నీ సంకీర్తనవిద్యంబోలవు. నిగుఁ ముప్పది మూఁడు గోట్ల దేవతలు; నీవంటి బలవంతులు గారు. నీ

వరంబులకు హానిలేదు. నిన్నుఁ గొలిచినవారి పదవులు ధ్రువపట్టములు. ఇది లోకదృష్టాంతము. నీచరిత్రలు గణుతింప నలవిగావు. మఱియు నితర మార్గంబు లెండమావుల నీళ్ల వంటివి; మిణుంగురుఁబురువుల ప్రకాశము వంటివి; కాకిబేగడలసొమ్ము వంటివి; కప్పచిప్పలవెండి వంటివి. ఇట్టి భ్రమలం బొరలక నీశ్రీపాదంబులే గతి యని యున్నవారలు ధన్యులు. శ్రీవేంకటేశ్వరా !

## 18

నారాయణా ! పుట్టువులు హేయమూల మనంగా నూరక రోయుటే కాని యవి యెవ్వరికి నపకారకంబులని తెలియంబడవు. కర్మంబులు ఫలంబు లొసగునని చేయుటకాని యవి మాతో నొడంబడుటలేదు. సంసారభారంబున నూరక జడియుటకాని యది యెవ్వరికి నసహ్యంబని తోఁపదు. మోక్షంబు మంచి దనంగా నాసపడి వెదకుట కాని యది తొల్లి యనుభవించి చూచినది గాదు. నీవు సర్వేశ్వరుండ వనఁగా విని మ్రొక్కుట గాని నిన్ను నింతటివాఁడ వని తెలియ నలవిగాదు. ఏమని విన్నవించెద ? నాజ్ఞానం బనఁగా నెట్టిది ? తొలిజన్మంబున నామీఁదఁ గటాక్షం బేపాటి పెట్టితివో యీజన్మంబున నీ దాసుండం గాఁ గలిగె. శ్రీవేంకటేశ్వరా !

## 19

సకలలోకారాధ్యా ! అన్నిచోటుల నుండుదువు గావున మే మెచ్చట నుండి సంచరించి వచ్చినను నీయొద్ద నున్నవారమే; నీవు సకల లోక నాథుండవు గావున నిన్నుం గొలిచిన వారమే ; కన్నుల యెదుట నున్న రూపంబులెల్ల నీ శరీరంబు గావున నిన్ను సదా సేవించినవారమే ; మాలో నెప్పుడుఁ బాయకుండుదువు గావున నిన్నుం దలంచినవారమే. నేఁగొనియెడి యాహారంబులు నీ విచ్చినవి గావున నీ ప్రసాదోజ్జీవనమే ; నేఁజేయుచున్న కృషిగోరక్షణవాణిజ్యాదులు నీ లీల కుపయోగంబులు గావున నవి నీ పూజలే; నన్ను నీవు పుట్టించినవాడవు గావున నీబాము

నీవల్ల నీడేఱెడిదె. ఈ యర్థంబు మఱవ కాదరింపుమయ్యా ! నే నెప్పుడు నీ సూత్రంబున నాడెడు బొమ్మను; నా విన్నపములు పదివేలు విన్నపములుగా విన నవధరించి నన్నుం గరుణింపవే శ్రీ వేంకటేశ్వరా !

## 20

హయగ్రీవా ! కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణు, మధుసూదన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ, నారసింహ, అచ్యుత, జనార్దన, ఉపేంద్ర, హరి, శ్రీకృష్ణ యనియెడి చతుర్వింశతి నామంబులు పాపహరంబులు; పుణ్యంబుల కునికిపట్లు; నుతించువారికి వచనభూషణములు; కోరినవారికిఁ గొంగు బంగారంబులు; జ్ఞానులకు సిద్ధమంత్రంబులు; ఇహపరంబులకుఁ గామధేను కల్పవృక్ష చింతామణు లివి; శ్రీ వేంకటేశ్వరా !

## 21

ప్రహ్లాదవరదా ! బదరికాశ్రమ నైమిశారణ్య సాలగ్రామపర్వతాయోధ్యా ప్రయాగ ద్వారావతీ పురుషోత్తమ సింహాచల శ్రీకూర్మాహోబల సేతు కుంభఘోణ తామ్రపర్ణి శ్రీరంగ కాంచీ నారాయణగిరులు మొదలగు పుణ్యక్షేత్రంబులు, నీ నూటయెనిమిది తిరుపతులు సేవించిన ఫలము నీ దాసులంగని యొకసారి నమస్కారంబు చేసినం బ్రసన్నుండవై యిత్తువు. నాలుగువేదంబులు, ఆఱు శాస్త్రంబులు, అష్టాదశపురాణంబులు చదివిన పుణ్యంబు 'నారాయణా' యనిన నొసగుదువు. అగ్నిష్టోమాతిరాత్ర వాజపేయ ద్వాదశాహ పౌండరీకాది క్రతువులు గావించిన సుకృతంబు నీ శ్రీపాదంబులపై నొక తులసీదళంబు సమర్పించినఁ గలిగింతువు. తులాభార హిరణ్య గర్భాది దానంబుల ఫలంబు మీ దాసుల మనినమాత్రంబ ప్రసాదింతువు. నీవు భక్తిసులభుండవు గావున నీ శరణార్థులకుం బ్రయాసంబులు లేవు; శ్రీ వేంకటేశ్వరా !

## 22

శ్రీజనార్దనా! శ్రీభూమీ నీళాసమేతా! శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గ కాయుధధరా! చతుర్భుజా! శ్రీకౌస్తుభమణి శ్రీవత్స శోభిత వక్షా! పీతాంబరధరా! మణికిరీట మకరకుండలాభరణా! వైజయంతీ వనమాలాలంకృతా! పుండరీకాక్షా! అనేక బాహూదరశిరః పాణి పాదోరు జంఘావయవా! విశ్వరూపా! అనంతగరుడవిష్వక్సేనాది నాయకా! సనకసనందన సనత్కుమార సనత్సుజాత సల్లాపా! నారద గానప్రియా! నీలమేఘశ్యామలా! చతురాననజనన నాభీసరోజా! గంగానదీ కారణ శ్రీ పాదపద్మా! భక్తవత్సలా! వేదోద్ధారకా! వైకుంఠ పురవరాధీశ్వరా! అసురశిక్షకా! అమరరక్షకా! జగన్నివాసా! జయ జయ, నీకు ననంత నమస్కారంబులు సేసెద. అవధారు; శ్రీ వేంక టేశ్వరా!

## 23

గజేంద్రవరదా! నీవు మాకుం గల వని యొరులం దీవింతుఁగాని యా దీవనఫలము నొసగ శక్తుండనుగాను. నీవు నాయందుఁ బ్రవేశించి యున్నావని మ్రొక్కించుకొందుంగాని రాజసమున మ్రొక్కించు కొన్న వాఁడనుగాను. నీ దాసుండనని పెద్దలతో దొరలుచున్నవాఁడం గాని నా తపోమహత్త్వంబున నధికుండనని యహంకరించినవాఁడం గాను. నీవు మనుష్యునిం జేసి ప్రవేశింపఁ బుట్టితింగాని నా స్వతంత్రంబునఁ బుట్టినవాఁడను గాను. నే నెంత జడుండైన నెన్నివిధంబుల విడువం దగునె నన్ను? శ్రీ వేంకటేశ్వరా! ✓

## 24

ప్రద్యుమ్నా! నీ పాదంబులు మనంబునఁ దలఁచెదను; వాక్కునం గొంత నుతించెదను; నా చరణంబుల మీకుఁ బ్రదక్షిణంబు వచ్చి చేతులెత్తి మ్రొక్కెదను; నాకుం గలిగిన యుపాయంబు లవియు; కాన

బహువిధానంబులు పెంచి కర్మంబులుచేసి మిమ్ము మెప్పించ శక్తుండఁ గాను. మీకు దయ యుండ నతి ఘోర తపంబుచేసి హర్షించి వరంబు లడుగనేర. ఉద్ధవునిరీతి గోపికలకు మీకు నెడమాటలాడి మిమ్ము నభిముఖునిఁ జేసికొన సమర్థుఁడంగాను. సుగ్రీవునిగతి సేనలం గూర్చుకొని మీ యవసరమునకుం గొలువ బలవంతుండంగాను. నా పురుషార్థం బీపాటి. నన్నుఁజూచి 'వీఁడేల తగిలెడు' నని కలంగకు; పరుండు వానికి భూమి యాధారంబు; నదులకు సాగరంబే గతి; పక్షులకు వృక్షంబే వసియింపఁజోటు; సస్యములకు వర్షంబు; నాకు నీవు. శ్రీ వేంకటేశ్వరా!

## 25

సంకర్షణా! నీ మాయామాత్రంబున మానవులకు నీవు దారులోహ పాషాణమృణ్మయంబులైన రూపంబులు వహించుకొని గుళ్లలోపలను ఇంటింటివారిచేతను బూజలుగొని వారు గోరిన వరంబు లొసగుచున్నాఁడవు. ఏమియు నెఱుంగనివారి కెంత సులభుండవై యున్నాఁడవు? నీ వితరణ గుణంబు నిన్నటువలెఁ జేసినదియో? ఈగతిం గరుణించుట నీ వ్రతంబో? నీ కది స్వభావగుణంబో? దీనులఁ గాచుట కీర్తియో? రామరామ! అరుదరుదు నీ మహత్త్వంబు! నీ చరిత్రంబు విని వెఱఁగయ్యెడు. మేలు మేలు! ఎల్లైన నింక నాజన్మములు ఫలించె; మనోరథంబు లీడేఱె. సంతోషంబు పరిపూర్ణంబయ్యె; శ్రీ వేంకటేశ్వరా!

## 26

దానవారీ! తొల్లి నే నుత్తమగుణంబు లెఱుంగను. నామీఁదం గృప పెట్టి పెద్దలు నన్నాచారవంతుం డందురను నభిమానంబు రేఁచి నన్ను సాత్త్వికుంగాఁ జేసితివి. ఒరులు నన్నుం జెనకుదురోయని పీఁటికి తనంబుఁ బొడమించి శాంతునిఁగాఁ జేసితివి. కాంతలు ధనం బపహారింతు రనియెడు లోభంబు పుట్టించి జితేంద్రియునిఁగాఁ జేసితివి. అలయుటలం

బొంది ధనం బార్జింప వేసటనొందించి విరక్తునిఁగాఁ జేసితివి. నరకభీతి నివారించుటకై నీమీఁద భక్తి పుట్టించి నీ శరణు సారం జేసితివి. ఈరీతి ననాదిసంసారసక్తుండనైన నన్ను నొక్కొక్క యుపాయంబున నీ కభిముఖునిఁగా దిద్దుకొంటివి. మఱి యింక నేఁ బ్రార్థించి నీకుం జేయు విన్నపము లేమియున్నవి ? నీ దైవిక ప్రయత్నంబు ముందఱ నా మానుషప్రయత్నంబులు పచరింప సిగ్గయ్యెడిని. బాపురే ! నిన్ను మెచ్చి నీకేమి యొసగెదము ? నిన్నుం బొగడుటే మాచేత నైనపని ; శ్రీ వేంకటేశ్వరా !

## 27

పురుషోత్తమా ! వేదంబులు రత్నాకరంబులవంటివి ; తమలోని యర్థంబులు బయలుపడనీయవు. పురాణంబులు గంటవేఁటకాండ్రవంటివి ; నానార్థంబులు చాటిచెప్పి భ్రమియింపంజేయుఁగాని యొకట నిశ్చయంబు దేటపడవు. భాట్టప్రాభాకరాది శాస్త్రంబులు నన్యోన్యశత్రులవంటివి; ఒండొంటిఁ ద్వేషించుఁగాని నీమీఁదిభక్తి బోధింపవు ; దానంబు లింద్రజాలంబులవంటివి. ఒకటి పదియై యనుభవింపఁ జేయుఁగాని ముక్తికిం దెరువుఁ జూపవు. ఇతర కర్మంబులు చేనిపంటలవంటివి ; జన్మపరంపరకు హేతువులై దేహముల మొలపించుంగాని వైరాగ్యంబుఁ బొడమనీయవు. వీనిచందంబు లిట్టివి ; ఏమిటం దెగు సంశయంబు ? నిక్షేపంబు, వెట్టినవాఁడు చూపక కానంబడదు ; నీవు సర్వజ్ఞుండవు ; నాకు నుచితార్థంబు లిట్టివని తెలుపఁగదవే ; శ్రీ వేంకటేశ్వరా !

## 28

పరమపురుషా ! నేను దుర్జనుండనని యెవ్వరు మఱుఁగుపడ విన్నపంబు సేయుదురో ? యిప్పుడే నా నేరములు నేనే చెప్పుకొనియెద. మండాడుకొనియెద. తప్పుకొనియెద. అది యెట్లంటివేని ; నేఁ జేసిన పాపంబులు నన్నుం జుట్టుకొనియెనేని నీ నామోచ్చారణంబు చేసి తప్పించుకొనియెద. నీచేతఁ గల్పితంబులైన విషయంబులు బాధింప

వచ్చెనేని నా మదిలో నీ పాదంబులు దలంచి నీ మఱుఁగున డాఁగెదను. పురాకృతకర్మంబులు నన్ను ననుభవింపవలయునని పట్టుకొనియెనేని నీవాఁడ నని బలిమిం ద్రోచెదను. యమకింకరులు నా తెరువు వచ్చిరేని నా భుజంబులనున్న శంఖ చక్ర లాంఛనంబులు చూపి వెలపించెదను. సంసారపాశంబులు నన్నుఁ దగిలెనేని నీకథలు విని పరాకు చేసికొనియె దను నీమాయ నన్ను ముంచుకొనియెనేని నీ దాసులకుం జెప్పి నీకు విన్నపంబు సేయించెద. నా యపరాధంబులు చిత్తంబునం బెట్టకుమీ; శ్రీ వేంకటేశ్వరా!

# 29

స్వామీ! నీవు రక్షింపఁదలంచిన బ్రహ్మశాపం బేమిసేయఁగలదు? ధ్రువునిఁ జిరకాలజీవునిఁ జేసితివి. బ్రహ్మాస్త్రం బేమిసేయఁగలదు? పరీక్షితుని బ్రదికించితివి. బ్రహ్మమాయ యేమి సేయఁగలదు? గోవత్స బాలకుల నిర్మించితివి. మృత్యువేమిసేయఁగలదు? సాందీపని కొడుకులం దెచ్చితివి. పాపంబేమి సేయఁగలదు? అజామిళు నుద్ధరించితివి. అన్నింట బలవంతుఁడవగుట నీ చేతలం గానంబడియె. నీ దాసులైన వారికి నేభయంబు నొందకుండం గాతువు. నీ ప్రతాపం బేమని వర్ణింపవచ్చు? శ్రీ వేంకటేశ్వరా!

# 30

పుండరీకాక్షా! అజ్ఞాన జంతువులైన మేఁకపోతు లింద్రాది దేవతలకుఁ బశుపురోడాశం బయిన సంబంధమునఁ దమ్ముంగాచు గొల్లవానితోఁ గూడి స్వర్గాది భోగంబుల ననుభవించునట! రాజ్యలోభంబునఁ గ్రోధంబు పెంచి సమరరంగంబున నన్యోన్య హింసాపరులైన వీరపురుషులు సూర్యమండలంబు సొచ్చి పోయి దివ్యపదంబు లనుభవింతురట! కామాతురలైన సతులు పతులం బాయలేక కళేబరంబులు కౌఁగిలించుకొని యనలంబుఁ బ్రవేశించి యుత్తమగతులం బొందుదురట! సమ్యగ్జ్ఞానసంపన్నులై నీ దాసులై దేహంబులందు నీ లాంఛనంబులైన

తప్త శంఖచక్రముద్రలం బరిశుద్ధులై, కామక్రోధ పశువుల జ్ఞానాగ్నిలో వేల్చి, తులసీయుక్తమైన నీ శ్రీపాదతీర్థసోమపానంబునం బాపంబులు విదల్చి, నీ ప్రసాదమనియెడి పురోడాశంబు నారగించి, యాచార్యోక్తి ముఖంబున నీ తిరుమంత్ర యజమాన పాఠంబులు జపియించి, నీకుఁ బ్రీతిగా శ్వేతమృత్తికా శ్రీచూర్ణ ధారణంబుఁ జేసి, పద్మాక్ష తులసీ మాలికలు పూని, నీపైఁ దలంపుం బెట్టుకొని నీ పూజాయాగంబు నిత్యంబును జేయు వైష్ణవోత్తముల భాగ్యంబు లేమని వర్ణింపవచ్చు ? శ్రీ వేంకటేశ్వరా !

## 31

పద్మనాభా ! నీకు మ్రొక్కనెత్తిన కేలి నమస్కారంబు ముంజేతికంకణంబు ; నీ లాంఛనంబులైన తిరుమణి పదంబుల జోడు మంగళ సూత్రంబు ; ఇతరంబుమాని నిన్నే కొల్చుట పాతివ్రత్యధర్మంబు ; నీ దాసులసంగతి మెలంగుట కులాచార నియమము ; నీపై భక్తి నిష్ఠకుంజొచ్చు టుంకువధనం బందుకొనుట ; నీ దాస్యమే మానంబు; నీ కైంకర్యంబు సేయుట కాపురము సేయుట ; నీ మూర్తి సేవించుటే సదానుభవంబు ; నీ ముద్రలు ధరియించుటే చక్కఁదనంబు ; ఆచార్యోపదేశంబే యావజ్జన్మసంపద; యని నిన్ను భజియించువారలు శ్రీవైష్ణవులు. ఇటువంటి వారలకు నీవు వరదుండ వని వింటిమి ; మేము వీరిలోనివారమే. నీ చిత్తంబునఁ బెట్టుమీ ; శ్రీ వేంకటేశ్వరా !

## 32

కోటిసూర్యప్రకాశా ! లీలావినోదంబులకు నీవు గడియించుకొనిన ద్రవ్యంబులు లవణేక్షు సురా దధి ఘృత క్షీరాదులు సముద్రంబులై యున్నవి ; కాంచన రజత ముఖ్యలోహంబులు పర్వతంబులై యున్నవి; సకలధాన్యంబులు నిచ్చుఁ గ్రొత్తపంటలై రాసు లగుచున్నవి ; పద్మరాగ వైడూర్య రత్నసంఘంబులు భూగర్భంబున నిక్షేపంబులై యున్నవి;

పుణ్యనదులు నీ రాజ్యంబునకుఁ గట్టు కాలువలై యున్నవి; పుష్ప ఫలసమేతంబులు కాననంబులు నీ శృంగారపుఁ దోఁటలై యున్నవి; గజ వాజి రథ పదాతి సమూహంబులు పట్టణంబు లెందుఁజూచిన నీ తాణంబులై యున్నవి; జగదేక కుటుంబివైన నీవు సంసారంబు సేయఁగాఁ జూచి నోరూరుచున్నది. ఇతరులు మోక్షంబడుగ నెట్లు సమ్మతించెదరు? నీతోడి కాపురంబు గోరెదరుగాక! వారివలనఁ దప్పేమి? శ్రీ వేంకటేశ్వరా!

# 33

బలిబంధనా! దేహధారులకు రాగద్వేషంబు లుడుగ నెట్లు వచ్చు? బొందితో స్వర్గంబునకుఁ బోయిన ధర్మరాజును నున్నతపదంబున నున్న దుర్యోధనాదులం జూచి కనలిపడియెనట; మే మనంగా నెంతవారము? దేవా! నీవు పంచేంద్రియంబులు పటియ విడిచి, ప్రాణుల నజ్ఞానమున ముంచియెత్తి భ్రమియింపంగా నీతో నెదిరించి వాని నణంపశక్తులమె? నీకు శరణని నీ నామసంకీర్తన చేయంగ నీ చిత్తము! మాభాగ్యము! ఎట్లు చేసిన నీ చేతిలోనివారమే! శ్రీ వేంకటేశ్వరా!

# 34

వేదవేద్యా! నీవు లోకవ్యాపారంబున నానాజీవులఁ బోషింపుచుండ నే నొక్కవంక నీ మూర్తి నా మనంబున భావించి చిక్కించుకొని నీతో బట్టబయలు మాటలాడుచు నానామనోరథంబులం గాలక్షేపంబు సేయుచున్నాఁడను. ఇది నీవు సేయు నుద్యోగంబునకుం బరాకుసేయుట గాదుగదా! కాదులే. విశ్వతోముఖుండవు గావున నందఱితో మాట లాడ నోపుదువు. పరిపూర్ణుండవు గావున నన్నిచోటుల నుండనోపుదువు. మా కపచారము లేదు. అనంత శక్తిధరుండవు, ననేకమహిమల వాఁడవు, నపరిమితోదారగుణుండవుఁ గావున నిట్టి నీ మాహాత్మ్యంబు నకు శరణంబు; శ్రీ వేంకటేశ్వరా!

## 35

దేవదేవా! నిన్ను నేఁ బలుమాఱు దలఁచిన వీఁ డేమి కోరి తలఁచుచున్నాఁడో యని నీ చిత్తంబున నుండునని యొకానొకసారి నిన్నుఁ దలంపుదును. మఱియును మేనిం బడలించి తపంబుసేసిన నంతరాత్మవైన నిన్ను బడలిక సోఁకునో యని యూరకుండుదును. పేరుకొని నిన్నుఁ బిలిచిన నన్నిపనులు విడిచివత్తువో యని మానంబున నుండుదును. జగత్తున నీ వుండుట భావించిచూచిన నిన్ను శోధించిన ట్లయ్యెడినో యని పరాకుచేసికొందును. నీ చరిత్రంబులు సారెసారెకు వినం గడంగిన రహస్యంబులు బయలఁ బడునో యని యాలకింపను. నీ కొలువు సేసి పాదంబులకు మ్రొక్కంగా మందెమేల మయ్యెడినో యని యంతట నింతట నుండి సేవింతును. ఇది యెఱిఁగి నీవే దయంగావుము; శ్రీ వేంకటేశ్వరా!

## 36

వైకుంఠనాథా! హిరణ్యగర్భాదులకుఁ దండ్రివైన నిన్ను, సనకాదులకు నేలికవైన నిన్ను, దివిజులకు రక్షకుండవైన నిన్ను, మునులకు వరదుండవైన నిన్ను, జ్ఞానులకుఁ బరదైవతంబవైన నిన్ను, జగంబులకు మూలకారణమవైన నిన్ను యశోదానందగోపులు పుత్రుండవని పెంచిరి; గోపికాజనంబులు పతి వని తలంచిరి; పాండవులు బావమఱఁదివని భావించిరి. వీర లటువంటి మమకారంబు లనుభవించిరి. మఱికొందఱు ముచికుంద దధిభాండ కమలాకర భీష్మాదులు పరతత్త్వమైన నారాయణుండవని భజియించి బ్రహ్మపదంబునం బొందిరి. ఇన్ని విధంబులవారికి నీ వొక్కండవే గుఱి. ఎటువలె భావించిన నటువలె నౌదువు. వివేకింప నేర్చినవారి పాలిటి నిధాన మవుదువు; శ్రీ వేంకటేశ్వరా!

# 37

సత్యసంకల్పా! ప్రపన్నులైనవారికి మీదాసుల శ్రీపాదతీర్థంబు శిరసావహించుట సకల పుణ్యనదీస్నానములు; త్రికాలంబుల నాచార్యవందనంబులు సంధ్యావందనంబులు; అభ్యాగత శ్రీవైష్ణవుల నుపచరించిన వాక్యంబులు గాయత్రీమంత్ర జపంబులు; పూర్వాచార్యోక్త స్వరూపగ్రంథానుసంధానంబులు వేదపారాయణంబులు; జ్ఞానాగ్నియందుఁ గామక్రోధంబులనుసమిధల వేల్చుట యౌపాసనంబు; ఆర్తులైనవారికి శ్రీవైష్ణవమార్గంబు లుపదేశించుట లతిథిసత్కారంబులు; తాతముత్తాతలమాద్రి నుండుటే దేవ పితృ సంతర్పణంబులు; మీ తిరువారాధన సేయుటే సకలయజ్ఞంబులు చేయుట; వేదోక్తంబైన కర్మనియమంబులు ఫలంబులు నిటువలె సిద్ధించె. నిదియ పరమార్థంబు. నిన్ గొల్వవచ్చు; పాపముంబట్టి నిర్దహింపవచ్చు; నిన్ను ముట్టి మెప్పింపవచ్చునే! శ్రీ వేంకటేశ్వరా!

# 38

నిగమగోచరా! నామనంబు ధ్యానయోగంబు సేయంగడంగినఁ జండాల గార్దభ సూకర కాంతలు తలఁపున బాటెడిని. అంతట నది విడిచి పురాణంబులు చదువం జూచినఁ దాటకా శూర్పణఖా విరాధ కబంధ రావణ కుంభకర్ణాదినామంబులు నోటం దొరలెడిని. అది మాని జపంబు సేయంబూనిన నిద్రయు, నావులింతలు, నలసత్వంబులుఁ బొదలెడిని. అది చాలించి తీర్థయాత్రకుఁ గుతూహలినైన దుష్ట చోర వ్యాఘ్ర మకరాదిభయంబులు వణఁకం జేసెడిని. ఈరీతుల నా ప్రయత్నంబు లెక్కడ కెక్కు? నేనొకటి దలంచిన వేఱొక్క చందంబున నీ మాయ భ్రమియింపుచున్నది. ఏ యుపాయంబున నిన్ను నావశము చేసికొనియెద? నా చందము నాకు బోధింపవే; నీవు జగద్గురుండవు; నా మర్మము నీచేత నున్నది; శ్రీ వేంకటేశ్వరా!

## 39

నగధరా! తరులతాపాషాణాదులైన కొన్ని జీవశరీరంబులు నరపశు పక్షిమృగాదులైన కొన్ని జీవజంతువులకు నాహారంబులై యున్నవి. విచారించి చూచిన నెవ్వరి కెవ్వరు చుట్టము లయ్యెదరు? ఋణాను బంధంబునం దగిలినవారు పుత్త్రమిత్త్రకళత్రాదులు; ప్రాకృతసుఖంబు లకుం దోడైనవారలు వీరు. స్వామీ! జగదేకకుటుంబివి నీవు. మోక్ష సుఖంబునకుం దోడైనవారు నీ దాసులు. ఇహపరలోకంబులకు సాధనంబులైన బంధువులు వీరు. మీ నామములు సకల దురిత నివార ణములు; మీ యాయుధములు మాకు సర్వరక్షకములు; మీ పాదం బులపై భక్తి మాకు వజ్రపంజరము; శ్రీ వేంకటేశ్వరా!

## 40

విష్ణుమూర్తీ! నేనెంతమూఢకఠినచిత్తుండనైన నీవు నామీఁదఁ గృప వెట్టిన సాత్త్వికుండ నగుదును; అది యెట్లంటివా? ఱాతిమీఁదం గడువ వెట్టినం గుదురుగాదె! కమరునం జవ్వాజి పూసినఁ బరిమళంబు పుట్టదే! చిల్కకుం జదువుచెప్పినఁ జదువనేరదే! అడవియిఱ్ఱికి వేఁట నేర్పినఁ బంపుసేయదే! ఇట్టు గావున నీవు నామీఁద దయఁదలఁచి తల్లి బిడ్డలం బిలిచి యాహారంబు వెట్టునట్లు, యజమానుండు దన పసులం దోలితెచ్చి యింటఁ బోషించినరీతి, నన్ను నీ చిత్తంబున దయఁదలచి నీకింకరునిగాఁ జేసికొనవే; శ్రీ వేంకటేశ్వరా!

## 41

గోవర్ధనోద్ధారా! నేను గరచరణాద్యవయవంబులు దాల్చి మాతృ గర్భంబునందుండి వెడలి పెరిగి బుద్ధినెఱింగి యీజగంబులకుం గర్త యెవ్వండొకో యని వెదకి వెదకి పురాణంబులవలన నీవైభవంబులు విని నిన్నుం గనుంగొన శక్యంబుగాక యెవ్వండవోకో యని విచారించి నిన్ను

నెఱుంగ నలవిగాక తిరుమల వరుస వెంటం జని వేంకటాచలం బెక్కి గరుడ స్తంభంబు చెంత జనులకు నీవొసగు వరంబులు సూచియుఁ, బాప వినాశనంబునఁ దీర్థంబులాడువారి పాపంబులు నీరై పాఱుటంజూచియు, ఆకొండమీఁదవృశ్చికసర్పాదిజంతువులు నిర్గతవిషంబులగుటం జూచియుఁ జోద్యంబు నొంది యచట నీ మూర్తి దర్శించి తొల్లింటి యజ్ఞానంబు విడిచి సందేహంబులు మాని నీవే యేలిక వనియు నే నీబంట ననియుం దెలిసి శ్రీ వైష్ణవుండ నైతి రక్షింపవే ; శ్రీ వేంకటేశ్వరా !

# 42

ఉపేంద్రా ! నీవు నాకు దేవరవై నాలోనుండఁగా నే నీదిక్కు సూడక యేకాంతంబని సంసారంబు చేసి బిడ్డలం గంటిని. అదియునుంగాక యేలికవైన నీవు నన్నుఁ జూచుచుండ భ్రమసి యెవ్వరుం గానరని చేయ రాని, పాపంబులు చేసితిని. మఱియు నీవు నాకుఁ దోడవై రక్షకుండవై యుండఁగా మఱచి యొంటి నున్నవేళ నొక్కండనే యని సంశయించి భూతంబులకు వెఱచితిని. క్రమ్మఱ నీవు నా మనంబులోఁ బంచేంద్రియ ములలో విహరింపఁగా వెఱవక, మందెమేల మని యెంచక, మంచము పై నిద్రించితి. ఒక్కొక్కవేళఁ దలిదండ్రులైన మీ రాత్మభోగంబుల నొసగుచు బాహ్యాంతరములం గాంచుచుండఁగాఁ గొంచించక సిగ్గు విడిచి మలమూత్రంబులు విసర్జించితి. ఎంచి చూచిన నా యపరా ధంబు లెన్నియైనం గలవు ; అన్నియును నోర్చుకొనుము. నా తప్పు లకుం బ్రాయశ్చిత్తంబుగా దండంబు పెట్టెద ; శ్రీ వేంకటేశ్వరా !

# 43

చక్రపాణీ ! నీ మాయలకు లోనై నేను వ్యసనంబులచేతం జిక్కి నప్పుడు నీబంట నని విడిపించుకొనుమీ ! ఆశాపాశంబులు నన్ను నలు వంకలకుం గుదియఁ దీసెనేని ప్రాఁతవాఁడనని వెనుక వేసికొనుమీ

కామక్రోధాదులు సారెసారెకుఁ బట్టఁ గడంగెనేని నీ ముద్రలు మోచిన వాఁడ నని యడ్డంబు రమ్మీ ! పురాకృతకర్మంబులు నన్నుఁ దగిలెనేని సంకీర్తన సేయువాఁడనని మన్నించి రక్షించుకొనుమీ ! నడుమ నడుమ నజ్ఞానంబు చిక్కించుకొనిన దానిం బరిహరించి నన్నుం జేపట్టుమీ ! మనసుపట్టలేక మనుపేవిన్నవించితి. నీ వనాథనాథుండవు; ఆర్తశరణ్యుం డవు; సర్వ భూత దయానిధివి ; నిర్హేతుక బంధుండవు ; నీవు నా హృద యంబులోనివాఁడవు ; నాకు దిక్కు నీవే సుమీ ; శ్రీ వేంకటేశ్వరా !

# 44

మాధవా ! మీ రర్జునునకు సాక్షాత్కారమై యుండి భగవద్గీత లేదు నూఱు గ్రంథంబులు బోధించితిరి. విశ్వరూపంబుసూపి ప్రమా ణంబుచేసి మి మ్మెఱుంగు మని యుపదేశించితిరి. ఇంక మముబోఁటి జీవుల నెన్నిట బోధింపవలయునో యందులకే చింతించెదను. అవులే ; ఇంకొక యుపాయంబు విచారించుకొంటి ; తొల్లి వాల్మీకి 'రామా' యను రెండక్షరముల నుడివి బ్రహ్మర్షియై మీ కృపకుం బాత్రుండయ్యె. నారదుండు మీ సంకీర్తనంబుసేసి కృతార్థుఁ డయ్యె. విభీషణుఁడు మీకు శరణుసొచ్చి బ్రదికె. నాకు నిదియే మార్గంబు ; శ్రీ వేంక టేశ్వరా !

# 45

నందనందనా ! చేయంగల పాపంబు లన్నియుఁ జేసితి ; నా కర్మం బే మనుచున్నదో యెఱుంగను. దేవర్షి పితృతర్పణంబులు సేయకుం టిని ; యమకింకరు లే మనుచున్నారో యెఱుంగను. ఎక్కడలేని యుద్యోగంబులు సేయుచున్నాఁడను ; విధి యేమనుచున్నదో యెఱుం గను. అన్నపానాదిభోగంబు లనుభవించుచున్నాఁడను ; చిత్రగుప్తుఁ డేమి వ్రాయుచున్నాఁడో యెఱుంగను. బాల్యకౌమార యౌవన గతులం బెరుగుచున్నవాఁడను ; కాలం బేమనుచున్నదో యెఱుంగను.

ఇన్ని యపరాధంబులకు గుఱియైనవాఁడ నగుట నాభయము నివారింతు వని నీమఱుఁగుసొచ్చితి. చేయంగల విన్నపంబు లెల్లఁ జేసికొంటి; నీ చిత్తం బెట్లున్నదో యెఱుంగను. శ్రీ వేంకటేశ్వరా!

## 46

ఆదిమూర్తీ: నేను భూలోకంబున నా కర్మంబు లనుభవింపం బుట్టితిఁ గాని నిన్నుఁ గుఱితెఱింగి కొలిచెద నని పుట్టినవాఁడను గాను. ఇంతలో నీవు నిర్హేతుకలీలం గరుణించి, నన్ను బంటుగా నేలితివి. నా భాగ్యంబు లేమని పొగడెద; నిన్నుం బొగడుటేకాక! నే నేమితపంబు చేసితినో యది దలంపనేల? నీమహిమ దలఁచుటగాక! నా బుద్ధి నేమి మెచ్చుట? నీ సంకల్పంబు మెచ్చుటగాక! దప్పిగొన్న యతండు జలముల వెదకుచుండ భాగీరథీజలంబబ్బినట్లు, కృషికుండు తనచేనుదున్నుచో నాఁగంటికొన బంగారు కొప్పెర దొరకినట్లు, పులిజూజంబాడెడువాఁడు జాలెఱుతటి మాణిక్యంబు చేకూడినట్లు నీవు నాకుం దొరకితివి; శ్రీ వేంకటేశ్వరా!

## 47

మత్స్యావతారా! అవధారు! దేవ, నాలోని పాపపురుషుండు విజృంభించి తఱుముకొని రాఁగా నీ మఱుంగు సొచ్చితి. అంతలో నీ యభయదాన పురుషుండు వచ్చి యతనితో దారుణయుద్ధంబు సేయఁ దొడంగెను. అరిషడ్వర్గంబు లనియెడి చుక్కలు డుల్లె; తాపత్రయం బనియెడి పిడుగులు రాలె; చింతాసముద్రంబు గలంగె; నిర్దయ యనెడి ధరిత్రి వణఁకె; దుర్గుణంబు లనియెడి దిక్కులు చలియించె; దురాశాపర్వతంబులు గ్రుంగె; అతిఘోరసమరంబునఁ బాపపురుషుండు నోడిపాఱె; మీయభయదాన పురుషుండు గెలిచె; ఈ మేలువార్త మీకు విన్నవించితి; శ్రీ వేంకటేశ్వరా!

## 48

కమలనాభా ! నే నీవేగువాఁడనై విన్నపంబు సేయవచ్చితి ; ఏకాంతం బున విన నవధరింపుము. భువిలో శరీరం బనియెడి మాయాపట్టణంబు గలదు. అందు కహంకారం బనియెడి రాజు ; చలం బనియెడు ప్రధాని; విషయంబు లనియెడి కరితురంగంబులు ; పాపంబు లనియెడి వీరభటులు; కోరిక లనియెడి కాపులు ; రతిసుఖంబు లనియెడి ధనధాన్య భండారం బులు గలవు. ఈరీతిఁ గోటలోనివారలు ఆశలనియెడి నిశాసమయం బుల నేమఱి నిదురవోవుచుందురు. జ్ఞానంబనియెడి నీ యూడిగపు దొరతో నన్ను బుద్ధి వైరాగ్య శమ దమంబు లనియెడి బలము వెంటఁ గూర్చి యంపితేని ఆకోటగొని యందు ప్రాణంబుండి పగవారి నందఱను గెలిచి పట్టి తెచ్చి యప్పగించెదం బంపు వెట్టవే ; శ్రీ వేంకటేశ్వరా !

## 49

సుదర్శనధరా ! జీవులునేసిన పుణ్యాపాపంబులు చిత్రగుప్తులు వ్రాయు దురట ; నామీఁద నేమి వ్రాయుదురో యెఱుంగను. నేఁ జేసిన పుణ్యంబులు మీకు సమర్పించితిని ; పాపంబు సేయించిన యింద్రియం బుల మీముందటం బెట్టితి ; మనంబు మీకు నప్పగించితి ; భక్తి మీకుం గానుకగాఁ బెట్టితి ; శ్రీ వైష్ణవుండనై మీదాసుల మఱుంగు సొచ్చితి. అన్నింట నా కొఱంతలు దీర్చుకొంటిని. ఇంక నామీఁదఁ జిత్రగుప్తులు నిలువలు వ్రాయంబనిలేదు. ఇందుకు సాక్షియు నీవె ; ఎఱుకయు నీవె; విన్నవించితి. శ్రీ వేంకటేశ్వరా !

## 50

రంగధామా ! నీవు నీటిపైఁ గొండలఁ దేలించిన బలవంతుండవని, కోఁతులచేత రాజ్యంబు సేయించిన నేర్పరి వని, రాతికిం బ్రాణంబు లిచ్చిన యుదారుండ వని, కొండ గొడుగుగాఁ బట్టిన సత్త్వ సంప

న్నుండవని, ఒక గజముమాట వినివచ్చి కాచిన భక్తసులభుండవని, ఆఁడు దాని మొఱాలకించిన దయాళుండ వని, ప్రహ్లాదుని ప్రతిజ్ఞ చెల్లించిన భక్తపరిపాలకుండ వని, పదియాఱువేల నూటమెనమండ్రు దేవుల కందఱ కన్నిరూపులై వినోదించిన నెఱజాణవని నీకు మ్రొక్కెఁతి; నిన్నుం గొల్చితి; భవంబులం గెల్చితి; సంతోషంబున నృత్యం బాడెదను; శ్రీవేంకటేశ్వరా!

## 51

రావణాంతకా! నీవు దేవసంరక్షణార్థమై పాయసంబులోఁ బ్రవేశించి కౌసల్యాగర్భంబున జన్మించి తాటకాహరణంబును, సుబాహు రాక్షసవధయును, కౌశికయజ్ఞ సంరక్షణంబును, అహల్యాశాపమోక్షణంబును, ధనుర్భంగంబును, సీతావివాహంబును జేసికొని పరశురాముఁడు మింటికిం గట్టిన త్రోవలు దెగనేసి దశరథుండు పట్టంబుగట్ట సమకట్టినఁ గైకేయిచేతఁ బదునాలుగేం డ్లరణ్యావాసంబునకు మితి చేసికొనిన కారణం బేమి? అవులే; దశకంధరునికిఁ బదునాలుగేం డ్లాయుశ్శేషము నాఁటికిఁ గలిగెఁ గాఁబోలును; తావత్పర్యంతమును, శూర్పణఖా నాసికాచ్ఛేదనంబును, మారీచ కబంధ ఖరదూషణాది హననంబును, వాలి నిబర్హణంబును, సుగ్రీవాదివరణంబును, వానర నియోగంబును, సముద్రబంధనంబును జేసి యంతట రాక్షససంహారంబుగావించి, లంక విభీషణున కిచ్చి సీతాసమేతుండవై యయోధ్యాపట్టంబుఁ గట్టికొంటివట! ఎంత కపటనాటకసూత్రధారివి? శ్రీ వేంకటేశ్వరా!

## 52

కేశవా! నీవు విరక్తులకు మోక్షసుఖంబవై యుందువు; ప్రాకృతులకు సంసారంబవై యుందువు; నిన్ను ధ్యానంబు సేయువారలకు సాకారంబవై యుందువు; ఇతరులకు ముప్వురిలో నొక్కండవై యుందువు; మూఢులకు నవేద్యుండవై యుందువు; దనుజులకు

నహంకారంబవై యుందువు; దేవతలకు బ్రహ్మపదంబవై యుందువు; ఈరీతి వారివారికిఁ దగినట్లు నీరుకొలఁది తామరవై యుందువు. ఓపిన వారి కోపినంత భాగ్యంబవు; నీకు శరణన నేర్చినవారిని నీవే రక్షింతువు; నీవలనఁ గొఱంత లేదు; శ్రీ వేంకటేశ్వరా!

## 53

అచ్యుతా! మిమ్ము నేమియు నడుగ ననియెడు నహంకారంబు గలవాఁడఁగాను; మీ పనుల యెడ నపరాధంబు లేకుండెడు నట్లు కొలుతు ననియెడు గర్వంబు గలవాడం గాను; మిమ్ము నమ్మితి నని సారెసారెకుం గొసరెడివాఁడఁ గాను; మీకు విశ్వాసి నని యెమ్మెలఁ బొరలెడివాఁడఁ గాను; వేద శాస్త్రంబు లెఱుంగుదు నని పెద్దల ధిక్కరించెడువాఁడఁ గాను; ఆశ్రమాచారంబులు చూపి యుత్తమలోకంబులు చూరఁబాఱి సరిగెల్వ నెఱపెడివాఁడఁగాను; మీమీఁదిభక్తిగలదని బలిమి చూపెడివాఁడఁగాను; శేషత్వపారతంత్ర్యముల మఱుఁగున నిల్చి మిమ్ము సేవించు మీదాసానుదాసుండ నని యెఱుంగుమా; శ్రీ వేంకటేశ్వరా!

## 54

భుజగేంద్రశయనా! లక్ష్మీసమేతులరై యేమేమి సేయుచుంటిరో మీ యవసరం బెఱుంగక మిమ్ముఁ దలంపరాదు. రుక్మిణీదేవితో నెత్తంబు లాడెడువేళ ద్రౌపది 'హా కృష్ణా' యని తలంచిన నక్షయం బని పాచికలు వైచితిరట; కరీంద్రుండు మిమ్ముం దలంచిన వైకుంఠభోగంబు లటువెట్టి వచ్చితిరట; ప్రహ్లాదుండు కంబంబునం జూపెద ననినఁ జించుకొని వెడలితిరట. ఈరీతి మీచరిత్రంబులు విన వెఱఁ గయ్యెడిని. మీవేళచూడక తలంచిన నపచారంబుగదా! మీయంత మీరెప్పుడు నన్ను మన్నించ విచ్చేయుదురో యని మీ శ్రీ పాదపద్మంబులచప్పుడు నాలకింపుదును. మీకై నే నేవేళనైనను హృదయంపువాకిళ్లు గాచుచుండెద; శ్రీ వేంకటేశ్వరా!

## 55

పరంధామాధిపా ! మీ మహిమసముద్రమునకుఁ గారుణ్యంబు జలంబు; మీ కల్యాణగుణంబులు తరంగంబులు ; మీ నిగ్రహానుగ్రహంబులు తిమితిమింగిలంబులు; మీ శ్రుతులు ఘోషంబులు; మీ గాంభీర్యంబులోఁతు; మీ ప్రతాపంబు బడబానలంబు; మీ కపటనాటక వ్యాపారంబులు మకరకచ్ఛపాది జంతువులు ; ఇట్టి మీ మహిమ సముద్రంబు మీ దాసులు మిమ్ముఁ గూడి తరవఁగాను భక్తియను కామధేనువు వొడమెను; జ్ఞానం బనియెడి చంద్రోదయం బాయె; ఆనందంబనియెడి యైరావతంబు, సాత్త్వికంబనియెడి పంచతరువులు, అనంతనామంబులనియెడి యప్సరః స్త్రీలు ; తిరుమంత్రం బనియెడి యమృతంబునుం బొడమె ; మీ యష్టాక్షరామృత మనుభవించుచున్నాము ; శ్రీ వేంకటేశ్వరా !

## 56

క్రౌలాంతకా! బ్రహ్మాండకోట్లఁ గుక్షింబెట్టుకొన్న నిన్ను గర్భంబున మోచెనట దేవకీదేవి; విశ్వరూపుండవైన నిన్నుఁ గౌఁగిలించుకొన్నారట గోపికలు; సర్వతోముఖుండవైన నిన్ను ముద్దాడెనట యశోద; అపరిమిత బ్రహ్మాంబైన నీకు ద్వారకానగరంబు గట్టెనట విశ్వకర్మ; సర్వవ్యాపకుండవైన నీకు రథముఁ గడపెనట దారుకుండు; అనంతనామంబులు గల నీకు నామకరణంబు చేసెనట గర్గుండు; వేదాంతవేద్యుండవైన నీకుఁ జదువు చెప్పెనట సాందీపుండు; ఇది యెటువంటి యద్భుతంబు; విన నగోచరం బయ్యెడిని. అట్లేకదా, నీకంటె నీదాసు లధికులౌట తేటపడె. శ్రీ వేంకటేశ్వరా !

## 57

జగదేకవీరా ! నాయర్థాతురత్వంబున నిన్ను 'దైవమా' యని దూటి సొలసితి ; ఐశ్వర్యగర్వంబుచేత మీ గుళ్లముందట వాహనంబు

దిగనైతి; మీ సన్నిధిని దాంబూలచర్వణంబులు చేసితి; బాల్య యౌవన కౌమార గతులచేత మీకు మ్రొక్కనైతి; మఱియును గొన్ని యేమియపరాధంబులు చేసితినో? నేఁ జేసిన యపరాధములకు క్షామకముగానిప్పుడే మీ తిరుమంత్రోచ్చారణంబు చేయుటచేతను చంచలత్వంబు విడిచి చిత్తము శాంతమునం బొందె. మీరే పరతత్త్వం బని తెలిసి శరణాగతుండనై మీ దాసులలోఁ జేరితిని; నేఁజేసిన యపరాధములకుఁ బరిహారముగా మిమ్ము నాకుం జాటి చెప్పిన యాచార్యుల శ్రీపాదతీర్థవిశేషములకుంజేయొగ్గెద; మీదాసుల పాదరక్షలు మోచెద; మీదాసానుదాసుల సేవకుండ నయ్యెద; మీదాసదాసీ జనంబులకు నీళ్లు మోసెద; మీ లెంకలకు లెంకతనంబునఁ జొచ్చి యచ్చువేసికొనియెద; నాసర్వాపరాధంబులు క్షమింపవే; శ్రీ వేంకటేశ్వరా!

## 58

లంకాపహారీ! వైష్ణవజ్ఞానం బనియెడియంజనంబుచేత నీ వనియెడి నిధానం బెత్తికొంటి. అదియునుంగాక నీపై భక్తి యనియెడి నావచేత సంసారసముద్రంబు దాటి వైరాగ్యంబనియెడి పదార్థంబు నీకు సుంకంబు వెట్టక బలిమిం దెచ్చుకొంటిని. నీ పాదంబులమీఁది తులసీ మాలికచేత నజరామరపదంబుఁ జాఱగొంటిని. ఇవి నాదుర్జనకృత్యంబులు; నీవు భూమీశుండవు. కనుకఁ నీవునన్నుఁ బ్రమోషంబు సేయకయున్నప్పుడే విన్నవించితి. నేఁజేసిన చేఁత లివి; ముందఱ నీచిత్తం బెట్లుండునో? ఇదిగో నీకు విన్నవించితిని, మఱవక విన నవధరించి రక్షింపవే; శ్రీ వేంకటేశ్వరా!

## 59

ముచికుందప్రసన్నా! సంసారధర్మంబు లనియెడు నంగళ్లలోపల నీతి సంగతులనియెడు వ్యవహారులు కోరిక లనియెడు సరకులు పచరించుకొని అగ్గువతో నమ్మఁగా నేను బహుళంబుగా సంపాదించుకొంటిని.

ఆ కోరికలను నొడిఁగట్టుకొని యనుభవించనే వేడుకయగుచున్నది. నిన్ను ధ్యానంబు సేయఁజనదు నామనస్సు క్రొత్త కోడెవంటిది. జ్ఞానంబని యెడు కంబంబునఁగట్టి వైరాగ్యంబనియెడు సాదుపసరముతో లంకెవైచి నీ కృపికి దిద్దుకొనవే; శ్రీ వేంకటేశ్వరా !

# 60

హిరణ్యగర్భా ! నీకుఁ బాన్పైన శేషుండు బ్రహ్మాండం బెత్తుకొనియె; నీకు వాహనం బయిన గరుత్మంతుం డమృతంబుఁ గొని చనియె; నీకూఁతురైన గంగాభవాని హరుశిరస్సునెక్కె; ధ్రువుండు బ్రహ్మలోకంబతిక్రమించె; నారదుండు సురలకుఁ బోరువెట్టుచున్నాఁడు; రుక్మాంగదుండు యమలోకంబుంబాడుచేసె; శకుండు వైరాగ్యంబు చూఱఁగొనియె; ఇందుచేతను నీదాసులు నీకంటె నధికులౌట తేటపడియె; శ్రీ వేంకటేశ్వరా !

# 61

రామరామ ! లోకంబెల్ల నొకపాదంబునఁ గొల్చితివట; నీ రూపం బేమని చెప్పుదును ? అనంతవేదంబులు నిన్నుం బొగడునట ! నీ గుణంబు లెన్నియని యెన్నుదును ? నీ రోమకూపంబుల నజాండకోట్లు నిండుకొన్నవట ! నిన్ను నేమని వర్ణింతును ? నీవు సర్వదేశ సర్వకాల పరిపూర్ణుండవై యుండఁగాను నీప్రభావం బేమని పొగడుదును? పురాణ పురుషుండవట; నీతుదమొద లెఱుంగువారెవ్వరు ? నిన్నుఁ దెలియ నుద్యోగంబుఁ జేసెద. నాయాస లేమని చెప్పుదు ? నంతయు నీ వెఱుంగుదువు; శ్రీ వేంకటేశ్వరా !

# 62

శరణాగతవజ్రపంజరా ! నీవు లోకసంరక్షణార్థంబై నీ స్వతంత్రంబున నెత్తిన రామావతారంబున నీ శక్తిని నీవె యెఱుంగ వని యందురు

గొందఱు. హరువిల్లు నెక్కు పెట్టి విఱిచినదియును, పరశురాముఁడు గడియించిన స్వర్గసోపానంబులం దెగ్రవేసినదియును, సుగ్రీవునికి వాలిం జంపెదనని ప్రతిజ్ఞ సేసినదియును, శరణుసొచ్చిన విభీషణునకు మున్నుగా లంకారాజ్యంబునకుఁ బట్టంబు గట్టినదియును, సీతను వెదకంబోయిన వానరులలోన హనుమంతుచేతికి నుంగరం బొసంగినదియును, జలధిపై విల్లు దొడిగినదియును నీ భుజబలిమియకాదె! నీ ప్రతాపంబు నీ వెఱుంగని దేమి? నీవు సర్వజ్ఞుండవు. నిన్ను నెఱుంగనివారలె యజ్ఞులు గాక! శ్రీ వేంకటేశ్వరా!

# 63

కౌసల్యానందనా! ఈ మనుష్యజన్మంబు నీవె నా కొసంగి పుట్టించితివి. ఇది నా కిచ్చిన వారకపు శరీరము. ఇందుల యాభరణంబులు, నన్నపానాది భోగంబులు, నీ కరచరణాద్యవయవంబులు చేసిన పుణ్య పాపంబులు నీకె సెలవు. నేనేమిటివాఁడను? అణుమాత్రపు జీవుండను. ఈ తనువు నామీఁద నదనంబు వెట్టితివి. రాచముద్రకుం బెట్టిన లంచంబు రాజునకు సమర్పణంబె కాదా! అది యెట్లంటివా? ఆత్మ నీవుండెడి నెలవు. నీ వున్నచోటను నూటయెనిమిది తిరుపతులును సకల పుణ్యక్షేత్రంబును నుండును. న న్నజ్ఞానంబు లంటనీయకు; శ్రీ వేంకటేశ్వరా!

# 64

సుగ్రీవరాజ్యస్థాపనా! నే నొకవేళ నీ దాస్య మనియెడి గజస్కంధమం దారూఢుండనై చరియింతు. మఱియొకపరి నీవు నాకుం గల వనియెడి విశ్వాసం బను తురంగంబు నెక్కి యాడెదను. ఇంకొకప్పుడు మీ కథలు విని యానందరథంబుపై విహరింతును. ఆ తర్వాతను వినయవిధేయవర్తనంబు లనియెడి చరణత్రాణంబులతోడఁ బదాతినై మీ యవసరంబు గాచుకొని ముందఱఁ గొలువు చేయుదును. ఈరీతి

చతురంగబలంబులతోఁ దోడుసూపంగల బంట నీకు; నామీఁద నేమి యపరాధంబు గలిగిన నోర్చుకొనుము; శ్రీ వేంకటేశ్వరా!

## 65

ఆనందనిలయా! మిమ్ము దర్శించుసమయంబున నొక కానుక గావలసి యపూర్వ వస్తు వెట్టిదో యని వెదకి వెదకి మఱియుఁ గొందఱ నడుగంగాను, వార లొండేమి యడుగుచున్నాఁడ వని హుంకారధిక్కారంబులచేత భర్జింపఁగాను వారలం దిరిగి కోపింపక యందులకు నోదిఁగి శాంతి గైకొని వర్తించితి. అంత నీ కామక్రోధ విరహితం బయిన శాంతమే కా యుత్తమ వస్తు వని నా మనోవీథిం గంటిని. అది నీకుఁ గానుకగాఁ దెచ్చితిని. అది యమూల్యము. తులాభార హిరణ్య గర్భాది మహాదానంబు లిందులకు సరిగావు. అష్టాంగ యోగంబుల సిద్ధులు నిందులోనే యున్నవి. తపంబునఁ బొందెడు మహిమయును దీన సిద్ధించును. నీ విందులకు సంతోషింతు వని యిది మేలైన వస్తువు గనుక సర్వేశ్వరుండ వయిన నీ ముందరం బెట్టక పోరా దని సమ్ముఖంబున నిల్పితిని. నా హృదయం బనియెడి భండారంబులోఁ బెట్టి పదిలంబుగా దాఁచుకొనుము, కొనుము; శ్రీ వేంకటేశ్వరా!

## 66

జ్యోతిర్మయా! నా కాఁపురంబు నీకు విన్నవించెద. మా పెద్దలు గడియించిన పూర్వాచార్యోక్త గ్రంథంబు లనియెడి వృత్తులు గలవు. అవి పలుమాఱు ద్రవిడ్రవిడ నానాదేశంబుల శ్రీ వైష్ణవుల కృప లనియెడి పంటకాల్వలఁ బాఱించుకొని వ్యవసాయంబు సేసి ముందరగా నీ కైంకర్యమనియెడి మొలకలను వి త్తి పైరుకొల్పి నీ యనుగ్రహ మను కొల్చు పండించి మన స్సనియెడి కణఁజంబునం బెట్టితి. భాగవత ధర్మంబు లనియెడి పాఁడిపశువులను బరిపాలించుకొనుచుంటిని. నీ ధర్మం

బున సుఖంబున్నాఁడను. దీన నిఁక నీ సారూప్యంబనియెడి ధనంబు గడించుకొనఁగలను; శ్రీ వేంకటేశ్వరా!

## 67

శంఖపాణీ! నా దేహం బొక నెత్తపుంబలక. నా పంచవింశతి తత్త్వంబులు సారెలు. నా యుచ్ఛ్వాసనిశ్వాసంబులు పాచికలు. నా పుణ్యపాపంబులు పన్నిదంబు లొడ్డిన ద్రవ్యంబులు. ఈరీతిఁ దన్నుఁ గాడెడి జూజగాఁడను. నీ మాయతో నింతగాలము నాడియాడి యోడి మఱి యొక్కొక్క జన్మంబునను మగుడ సూడుగొని యీ యాటలె యాడుచున్నాఁడను. గెలుపెట్టిదో, యెప్పుడో యెఱుంగను. నీవు నన్నేలిన యేలికవు. బంటు జయించినజయ మేలికదె కదా! నాకుంగాను సూడు వెట్టి గెలిపింపుమా! శ్రీ వేంకటేశ్వరా!

## 68

అభేద్యవిక్రమా! కన్నులు మూసిన లయంబును, దెఱచిచూచిన జగంబును, మేలుకొనిన నందు జననంబును, బరస్త్రీగమనంబున నరకంబును, స్వపత్నీసంతానంబున స్వర్గనివాసంబును, క్రోధంబున రాక్షసత్వంబును, ననాచారంబునఁ బాపంబును, నాచారంబునఁ బుణ్యంబును, నసత్యంబునఁ గీడును, సత్యంబున మేలును నీరీతి నందఱకుఁ గానవచ్చు. మఱపు పుట్టించుచున్నది నీ మాయయే యని యీయర్థం బెఱుంగుదురుగాని భ్రమియనివారు లేరు. ఇంతగాలంబున నే నెత్తిన జన్మంబులుం గోటానఁ గోట్లు గలవు. అన్నియు సంసారంబునకే సమర్పణం బయ్యెఁ గాని యిందులో నొక జన్మమైనను మీకు సమర్పణంబు గాదయ్యె. దేవా, యింక నా నేరంబు లెన్నియని యెంచెద! గతజలసేతు బంధనంబు. అట నీమాయ నిగ్రహించెద ననిన నది యశక్తి దుర్జనత్వంబు. నా మూఢత్వంబు చూచి యీ జన్మంబున నీవే దయదలఁచి నన్ను దాసునిఁగాఁ జేసితివి. నీ కుపకారంబు దక్కెను. నా మనోరథంబు నీడేఱెను; శ్రీ వేంకటేశ్వరా!

# 69

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! సకలప్రాణుల శరీరంబులు నీకు క్షేత్రంబులు. నీవు క్షేత్రజ్ఞుండవు. జీవులు నీ కమతీలు. ఇంద్రియంబులు నీకు నేరు కలపలు. ఇహపరసౌఖ్యంబులు కాఁపువేసంగిపంటలు. దేహానుభవంబులు నీవు వెట్టెడి జీతంబులు. లోకులు చేసిన ధ్యానానుష్ఠానఫలంబులు కొల్చు భండారంబులు. ఈరీతి ముందరికిని నందఱ హృదయంబులను జ్ఞానభక్తి వైరాగ్యంబు లసియెడి బీజంబులు మొలవం బెట్టింపుము; తొల్లి బలభద్రరాముండవై నాఁగలి ధరియించి దున్ని కాళింది కాలువలు దీర్చితివట! శ్రీ వేంకటేశ్వరా!

# 70

అసురకులసంహారకా! నేను జన్మం బెత్తి వయోమదోద్రేకంబున యుక్తాయుక్తంబు లెంచక మనస్సుం బొఱవిడిచి నానాభోగంబు లనుభవించి యందువలనఁ బుణ్యపాపంబుల యిఱుకునం జిక్కి కర్మబద్ధుండనై విడిపించుకొనఁ శక్తుండఁగాక బందెదొడ్డిం జిక్కిన పసరంబువలెను, పాశమునం బడిన మర్కటంబుపగిదిని, జోగిచేతం జిక్కిన సర్పంబురీతిం, బసిరికాయలోని కీటంబువలె, నుండి నీవు సర్వలోకనాథుండ వగుటం జేసి విన్నవించితిని. నే నీకుం దగులైనవాఁడ నగుట నీవు నన్నుఁ గరుణించి నీ ముద్రవేసి నీ దాసునిఁగాఁ జేసికొంటివి. ఈ సంతోషంబున నిన్నెంతయుఁ గొనియాడెద నోహోదేవరా! శ్రీ వేంకటేశ్వరా!

# 71

అమృతమథనా! మహాపురుషులు మిమ్ముంగోరి యతి ఘోర తపంబులు సేయువేళలఁ బక్షులు దేహంబులం గూళ్లం బెట్టునట! ఇటువంటి నియమంబున మిమ్ము నే నెట్లు ధ్యానంబుచేసి ప్రత్యక్షంబు సేసికొని మెప్పించెద? ఇంతలేసి పనులకు సమర్థుండనా? మీరుఁ జేతు

లెత్తి మ్రొక్కంగలవాఁడ నింతేకాని; తొల్లి మీరు రామావతారం బైనవేళ వనంబున సంచరించునప్పుడు, కృష్ణావతారంబైనవేళ నంద వ్రజంబున సంచరించునప్పుడు పాషాణతృణగుల్మలతాదులు మీ పాదం బులు సోఁకి పావనంబయ్యోనట! అవి యే తపంబులు చేసినవి? మాకు మీ శ్రీపాదములే గతి; శ్రీ వేంకటేశ్వరా!

## 72

వైజయంతీవనమాలికాధరా! ఈ బ్రహ్మాది దేవతల యైశ్వర్యంబులు నీ దేవుల కటాక్షవీక్షణంబులోఁ గించిన్మాత్రంబువలనం బొడమినవి. మహాపురుషుల మాహాత్మ్యంబులు నీవిచ్చు వరంబులలో లవలేశంబులు. అన్ని సదువుల ప్రభావంబులు నారాయణాష్టాక్షరంబులలోని సహస్రాం శంబులు. ఉత్పత్తి స్థితి లయంబులు నీ మాయాశక్తి సంకల్పమాత్రం బులు. నీ మహామహిమలం దెలియ నెవ్వరివశము? అగోచరములు! తర్కవాదముల కభేద్యుండవు; యుక్తుల కసాధ్యుండవు; భక్తులకు సుల భుండవు; నిన్ను నీవే యెఱుంగుదువు గాక యితరులకు నెఱుంగఁ దరమా; శ్రీ వేంకటేశ్వరా!

## 73

నరకాసురవైరీ! ఈ కల్పంబున బ్రహ్మదేవునికి నేఁబదియేండ్లు చెల్లె నట! అతని యొక్కదివసంబున స్వర్గంబునఁ బదునలువురు దేవేంద్రు లేలుదురట. ఇప్పు డేడవదేవేంద్రుఁ డేలుచున్నాఁడట. నేను నాఁట నుండి యెన్ని జన్మంబు లెత్తితినో? యేయేజాతులం బుట్టితినో? నేను మనుష్యుండ నని చెప్పుకొను టెట్లు? పుట్టువులు వేఱుగాని యప్పటి జీవుండనే నేను. ఇప్పుడు బ్రాహ్మణజన్మంబునం బుట్టించి శ్రీ వైష్ణ వునిం జేసి యేలితిరి. నాయంత నే నెఱింగి మీకు విన్నపంబు చేసిన వాఁడఁగాను. నాకుఁగా వేఱొకరు మీతోఁ బంతం బాడి యొడంబఱు చినవారు లేరు. మీయంతనే మీరు దయచం దలఁచి నన్నుం బ్రావ

నంబు చేసితిరి. మీరు నిర్హేతుక దయానిధు లౌట యిందులోనే విశదం బాయె; శ్రీ వేంకటేశ్వరా!

## 74

సోమకాసురభంజనా! భూమిమీఁద సస్యంబులు పండి నానాధాన్యం బులుఁ గొండలు కొట్లునై కుప్పలుపడుచున్నవి. సస్యంబులకు బీజంబు లొక్కటియును ఫలంబు లధికంబులునై యున్నవి. ఇంత సామర్థ్యం బాబీజముల కెక్కడిది? మీమహిమకెకాక. మీరు గలుగుట కిది లోకదృష్టాంతంబు. మిమ్ము నితరు లెఱుంగరానియట్లు వీవు గానరా దాఁగెదరు. మీ రెటువలె నుండినను, వేదశాస్త్రంబులు మిమ్ముఁ జాటిచెప్ప కేల మానెడిని? మహాత్ములైనవారు మిమ్ము నెఱింగి కొలువ కేల మానెదరు? మీకరుణ యిందఱమీఁదఁ బాఱ కెట్లుండె డిని? మీదివ్యతేజఃప్రకాశంబు లెటువలె మూసిపెట్టవచ్చు? చాలుం జాలు నింక మీ వినోదంబులు బయలుపడెను. విభాండకునికిఁ బ్రత్య క్షంబైనయట్లు, ముచికుందునికిఁ బ్రత్యక్షంబైనయట్లు, ఉదంకునకుఁబ్రత్య క్షంబైనట్లు నాకు మీరు ప్రత్యక్షంబుగండు శ్రీ వేంకటేశ్వరా!

## 75

అయోధ్యాపురాధీశ్వరా! యేరీతి మనస్సు పట్టుదునో యే చందంబున మెప్పింతునో యేరీతిఁ గృప నామీఁదం బాఱునో యెటువలె నా కభిముఖము చేసికొందునో యేక్రమంబున మీకుఁ జనవరినై బ్రదుకు దునో యని మానసంబునం గోరుచుందును. నీవు నాయంతరంగంబులోఁ జేరువనే యున్నాఁడవు. బ్రహ్మాదిదేవతలకు దుర్లభుండవైన నీవు నా కెట్లు సులభుండ వయ్యేవంచుఁ జాతకపక్షులు మేఘంబులలోని జలంబుల కాసపడినయట్లు, ఆకాశంబున నున్నసూర్యునితోఁ గమలంబులు చుట్టరి కంబులు చేసినట్లు, చంద్రోదయంబునకు సముద్రంబు పొంగినట్లు, వెన్నె

లకుఁ జంద్రకాంతంబులు గరఁగినట్లు నేను మీాదర్శనంబునకు వీక్షింపుచున్నాఁడ. అయితే నేమి కొఱంత? ఊరకున్న కీటంబుఁ దెచ్చి తుమ్మెద తనుఁ జేయుచున్నది. ఈ భ్రమరకీటన్యాయంబు దక్కింపనింక దేవరచిత్తము, నాభాగ్యము; శ్రీ వేంకటేశ్వరా!

# 76

వాసుదేవా! దేవకీనందనా! గోపాలమూర్తీ! లక్ష్మీమనోహరా! భూకాంతాప్రియా! గోపికావల్లభా! రుక్మిణీ ప్రాణనాయకా! సత్యభామామనోహరా! జాంబవతీసుముఖా! కాళిందీసరససల్లాపా! మిత్రవిందాభోగాలోకైకరతా! భద్రాకుచకుంభవిహారా! నీ రాసగ్రహాది సరససత్కథా ప్రసంగంబులు భాగవతపురాణంబులు. ఈ కథలు విన్నవారికిఁ బుణ్యంబు లనంతంబులై పరలోకసాధనంబు లగునటే! యివి యెటువంటి విచిత్రంబులు! నీకౌతుకక్రీడలు మోక్షసాధనంబులట! శ్రీ వేంకటేశ్వరా!

# 77

ధ్రువవరదా! నాకు నెటువలెఁ బ్రత్యక్షం బయ్యెదవో? విభుని రాకకుం గాచుకొన్న విరహిణిచందంబున మీా రాకకు నెదురు చూచుచున్నవాఁడ. చన్నుఁబాలకు దేవులు స్తనంధయునిఁ బోలి మీా భుక్తశేషంబు వెదకుచున్నవాఁడ. పొలముననుండి మేసివచ్చు ధేనువు రాకకుఁ గ్రేపుచందంబున మీా దేవుల కటాక్షంబునకు నేఁకారుచున్న వాఁడ. హంసతూలికా తల్పంబుమీాఁద శయనించు రాఘురీతి మీా పాదంబులకు సాష్టాంగము సేయం గాచుకొన్నవాఁడ; నివి నాగుణంబులు. అపేక్షించినవారి నుపేక్షింపరాదని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అది యట్లుండనిమ్ము. ఏలిక మన్నించుకొలఁదినేకాని బంటునకుం గొనరఁగా నడుగరాదు. నీవు నా హృదయంబున నెప్పుడును నేమఱకుమా! అన్నియు సమకూఱెడు; శ్రీ వేంకటేశ్వరా!

## 78

హలాయుధధరా ! మన్మథుం డనియెడు నింద్రజాల విద్యలవాఁడు సుందర స్త్రీ పురుషులచేత నింద్రజాలవిద్యల నాడింపుచున్నవాఁడు. అన్యోన్యావలోకంబుల కమల కల్హార పుష్పంబులు గురియింపుచున్న వాఁడు. మోహసముద్రముల నాకర్షించి బట్టబయల యీఁదింపు చున్నాఁడు. తుఱుమునఁ జీకట్లును ముఖంబునఁ జంద్రోదయంబును గాత్రంబున మొయిలులేనివానలును పరస్పర విహారంబుల నగ్నిస్తంభ నలును రతిబంధంబుల సిద్ధవిద్యలునుం జూపుచున్నవాఁడు. ఈ యాట లకు లోనై సమ్ముఖంబులనున్న జీవులము మిమ్ము నెఱుంగ వెఱుగందు చున్నవారము ; గాని, నీ వీమాయలకు లోనుగాక చిఱునవ్వుతో వీక్షింపుచున్నవాఁడవు. ఆతని కీవిద్యలు నేర్పిన గురుండవు నీవె కాఁబో లుదువు. నీకు వినోదంబైన నాయెఁగాని మమ్ము భ్రమియింపకువే ; శ్రీ వేంకటేశ్వరా !

## 79

ఖరదూషణవైరీ ! నీవు కల్పించిన వేదోక్తధర్మంబు లించుకంత దప్పక నడచెనా పాపంబులు చెందవు. అటమీఁద పరకాంతలు పరధనం బులు వేడుకపుట్టించుచు ముందఱఁ బొదలంగా జీవులము చంచలచిత్తు లము గనుక నా పాపంబులం దగిలి చేయక మానలేము. చేసినకర్మం బులు బలవంతంబులు. అనుభవింపక తీఱదు. దాన మాకు సౌఖ్యంబు గాదు. మేము గావించు నేరములు మామీఁద నుండంగాను మీకు నేమి విన్నపంబు చేసెదము ? మీ యాశ్రయ మనియెడి వజ్రపంజర మున్నది. మీ నామస్మరణ మనియెడి ఖడ్గమున్నది. మీపై భక్తి యనియెడి కవచమున్నది. మీకృప యనియెడి సహాయంబున్నది. నా యాచార్యులచేత సకల మీఁదురితములను గండలుగాఁ గొని తునియలుఁ చేసి పాఱవేయించెదవో కాక నీవే మాపై దయదలంచెదవో; శ్రీ వేంకటేశ్వరా !

# 80

చాణూరమర్దనా! మిమ్ముం బేర్కొని పిలిచి యావాహనముచేసి మా యింటిలోపలఁ బీఁటపైఁబెట్టి పూజించుచున్నవాఁడను. సముద్రుని కర్ఘ్య పాద్యా చమనీయంబుల నిచ్చినట్లు మేరుపర్వతంబునకు భూషణంబులు పెట్టినట్లు మలయాచలంబునకు గంధం బొసంగినట్లు వసంతునికిఁ బుష్పంబులు సమర్పించినట్లు కస్తూరిమృగంబునకు ధూపం బిచ్చినట్లు సూర్యునికి దీపారాధన చేసినట్లు అమృతప్రదుండవైన నీకు నైవేద్యం బిచ్చినట్లు నీరీతి మిమ్ము నలంకరించి యర్చింపుచున్నవాఁడ. నా చేఁతలకు మీరేమని నవ్వుచున్నారో లజ్జింపక యుపచరింపుచున్నాఁడను. అయినం గానిమ్ము. తొల్లి. మీరు కృష్ణావతారంబై యుండెడువేళ మిథిలానగరంబున శ్రుతదేవుం డనియెడి బ్రాహ్మణుండు మి మ్మింటికిఁ దోడ్కొనిపోయి పూజింపఁడె? మత్స్యావతారంబైన నాఁడు సత్యవ్రతుండను రాజు అర్ఘ్యము సమర్పించి మీరూపు దర్శింపఁడె? కుబ్జ మీకు గంధంబు లొసంగి సౌందర్యంబు వొందదె? మాలాకారుండు పువ్వులదండ లొసంగి మీచే మన్ననలు చేకొనఁడె? విదురుండు విందు వెట్టి వెలయఁడె? ఇవి చూచి మాకుఁ గొంచింపం బనిలేదు. నీవు భక్తసులభుండవు, మే మేపాటి యారాధించినం జేకొందువు. శ్రీ వేంకటేశ్వరా!

# 81

దేవచూడామణీ! నీ పట్టినవి శంఖచక్రంబులు, ఎక్కినది గరుడవాహనము, తాల్చినవి చతుర్భుజంబులు, నీవు కావించిన కృత్యంబులు కంస కాళియ మురి నరకాసుర మర్దనంబులు. ఇటువంటి నీవు నీలమేఘశ్యామవర్ణంబుతో విష్ణుస్వరూపుండవై నటియింపుచుండఁగాను నిన్నుఁజూచి దేవకీ వసుదేవులు నెటువలె భ్రమిసిరి? తపంబు సేయుచుండెడి వ్యాసవాల్మీకాది మునీంద్రులు మిమ్ముం జిక్కించుకొని మోక్షం బడుగ నేరీతి నేమఱిరి? శాస్త్రంబులు చదువుచుఁ బరబ్రహ్మం

బును వెదకెడి బ్రాహ్మణోత్తములైన విద్వాంసుల వివేకంబు లెందు వోయె? బ్రహ్మేంద్రాది దేవతలు మిమ్ము సేవించి మీ సాయుజ్యంబుఁ బొందరైరి. వారి భాగ్యంబు లెక్కడనుండె? అది యట్లుండనిమ్ము; అనాది దేవుండవై యిప్పుడిందఱ హృదయంబులలో నున్నాఁడవట! నిన్ను భావించి మఱచియున్నారము; శ్రీ వేంకటేశ్వరా!

# 82

వరాహావతారా! నిన్ను వెదకివెదకి వేసారితిని. నీవు పుట్టించిన బ్రహ్మాండంబునకు నమస్కారంబు. అట్టి బ్రహ్మాండమునకు నాధారంబయిన నీ రోమకూపంబునకు దండంబు. అజాండములోని నీ విశ్వరూపంబునకు సాష్టాంగంబు. నీ తిరుపతులకు వందనంబు. చరాచరంబైన నీసృష్టికి నభివాదనంబు. నీ రూపంబు లయిన విగ్రహంబులకు మోడ్పుఁగేలు. నీ యంతర్యామిత్వంబునకు జోహారు. నీ వున్న శేషాచలంబునకు వందనంబులు సేయుచున్నవాఁడ. అందున్న నీ మూర్తికి శరణు. నన్ను నీ కరుణాదృష్టి నవలోకింపుము. నా యజ్ఞానంబు చెఱుపుము. నీ పాదంబులపై భక్తి నా కెల్లపుడుం బాయకుండఁ జేయుము. శ్రీ వేంకటేశ్వరా!

# 83

అమితకల్యాణగుణాకరా! జాతికులశీలవిత్తంబులచేత నాకు గర్వంబు రేఁపుచున్నది నాచిత్తంబు; దీనికి బుద్ధి చెప్పుము. నాకు వశంబుగాదు. లోకంబులో వర్తమానంబు విచారించిచూచిన దాసీజనంబులకుం జెల్లునే యహంకారంబు; షండునకు వచ్చునే కామోద్రేకంబు; కార్యాతురునకుఁ గూడునే లోభంబు; దీనున కున్నదే బలిమి; ఆఁకొన్నవాని కుండునే మదంబు; అశక్తునకు వెలయునే మత్సరంబు; ఇటువంటి వారికెల్లను వారివారికి నాయాగుణంబులు సహజంబులు చేసి యిప్పించితివి; ఇవియెల్ల నసంభవబ్రహ్మచర్యంబులు. అందులకేమి? నాకు

నీ దర్శనంబు చూపి నా స్వతంత్రంబున నాతపోరాజ్యం బీడేర్పుము. నీ వెట్లు చేసిన నట్లాను, నీవు నాలోపల నున్నాఁడవు. శ్రీవేంకటేశ్వరా!

## 84

అధోక్షజా! ఎవ్వని రోమంబున నజాండకోట్లు వొడమె; నే మూర్తి నాభికమలంబున బ్రహ్మ జనించె; నే మహాదేవుని పేర "శ్రీమహావిష్ణోరాజ్ఞయా" యని మహాసంకల్పంబు చెల్లుచున్నది; ఏవస్తువుఁ బురాణపురుషుం డని చెప్పెదరు; ఏబలవంతుని దానవవైరి యండ్రు; ఏఘనుండు సముద్రంబుద్రచ్చి యమరుల కమృతంబు పంచిపెట్టె; నేపురుషునకు ప్రహ్లాద నారద వసిష్ఠాదులు దాసులు; ఏ ఘనునకు సూర్యచంద్రులు కన్నులు; లక్ష్మీపతి యెవ్వాండు; సర్వరక్షకుం డెవ్వాండు; యజ్ఞకర్త యెవ్వాండు; యజ్ఞభోక్త యెవ్వాండు; మోక్షం బియ్యఁ గర్తయెవ్వాండు; అతండవే నీవు. అట్టి నీకు ననంతనమస్కారములు సేసెద; చిత్తావధారు. శ్రీ వేంకటేశ్వరా!

## 85

యోగేశ్వరా! పరమజ్ఞానులైనవారికిఁ గామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబు లడంగవలయు. అవి యెటువలె నుడుగ వచ్చు? ఎండ నుండిన యతండు నీడకుం బోవఁదలంచిన నదియె కోరిక యయ్యోడిని; ఈఁగ తనమీఁద వ్రాలినఁ జోఁపుకోఁగణంగిన నదియే క్రోధం బయ్యోడిని. తన మంత్ర మొరులకుఁ జెప్పకుండిన నదియె లోభం బయ్యోడిని. పరులు దండంబు వెట్టినవేళ దీవించిన నదియె మోహం బయ్యోడిని; భిక్షాన్నంబు భుజియించి తృప్తిఁ బొందిన నదియె మదం బయ్యోడిని; శిఖలోపలఁ బేలు దిరుగం గ్రోఁకికొనిన నదియె మాత్సర్యం బయ్యోడిని. ఈ ధర్మంబు లెల్లఁ దప్పకుండ నడపెద నని యెంచిచూచిన నావలన నన్నియుం దప్పులే; సర్వాపరాధంబులుం జేసి నీమఱుఁగుఁ జొచ్చితి నన్నుం గావవే; శ్రీ వేంకటేశ్వరా!

# 86

సీతాపతీ ! మీ యాకారంబు కనులఁజూడ నెవ్వరి వశము ? మీ భక్త వాత్సల్యాది గుణంబులు దలంచుకొని కొంతదడవు జయవెట్టి మీ కల్పించిన జగత్తు చూచి కొంతదడ వాశ్చర్యంబు నొంది సర్వమైనవాడికి వరంబు లొసంగెడి మీ యుదారత్వంబు కొంతదడవు చింతించి మెచ్చి యహల్యా ద్రౌపదీ ప్రహ్లాదాదులకుఁ బ్రసన్నులరైన మీ మహిమ కొంతదడవు దలపోసి పొగడి రావణకుంభకర్ణముఖ్య దానవులఁ జెండాడిన మీ ప్రతాపంబు కొంతదడవు దలంచి విభీషణ హనుమత్ప్రభృతుల మన్నించిన మీకీర్తి కొంతదడవు పెద్దలచే విని మీకుఁ జేతులెత్తి మ్రొక్కి పరబ్రహ్మంబవై విలసిల్లు మీ ప్రభావంబు కొంతదడవు దలపోసి కొని యాడఁగలవారము. ఈరీతిం గాలక్షేపంబు చేయఁగా మీరు మాకుఁ బ్రత్యక్షంబైన ట్లుంటిరి. శ్రీ వేంకటేశ్వరా !

# 87

సర్వేశ్వరా ! అవధారు ; జగంబు నీ నాటకశాల ; నేనెత్తిన తొలు జన్మంబులు నీముందర నాడెడి బహురూపంబులు ; దారసుత బంధు జనంబులు మేళగాండ్రు ; నిన్ను నుతించిన వేదశాస్త్ర పురాణంబులు తూర్యత్రయంబు. మాపాదప్రచారంబులు నాట్యంబుసేయు చేతలు ; ఆడెడిమాటలు క్రియాభాషాంగంబులు ; భోగవస్తువులు మీరు మెచ్చి యిచ్చిన యీవులు ; ఈరీతి నెంతగాలంబు మీకు వేడుక యంతగాలంబు నాడెదము. మీ కొలువు నర్తకులైనవారము మీకు వినోదము చేసి కొని బ్రతుకవలయుఁగాని నెమ్మది మోక్షంబున నుండెద మనుట యే సంగతి ? మీర దయదలంచి కృపచేసిన నపు డయ్యెడుఁగాక, యెఱుక గల యేలికఁ గొల్చినవారికి నడుగ నేదిపని ? ఇంక నన్నిట నన్నిట మన్నింపవే ; శ్రీ వేంకటేశ్వరా !

## 88

మదనజనకా ! మిమ్ము నే ధ్యానంబు సేయునెడ మీ యవయవ సౌంద ర్యంబు దలంప నేరకుండినను మీకు శతకోటి జన్మాధారమైన చక్కఁదనంబు దాఁచరాదు. మీ తిరుమేని కది సహజంబు. మీ పరాక్రమంబు నేఁ బొగడ నేరకుండినను శంఖచక్రాద్యాయుధంబులు భుజంబుల ధరియింపవలయుఁ గాని మానరాదు. మిమ్ము నే శృంగారింప నేరకుండినను మీ కిరీట కుండల పీతాంబరాభరణంబులు లోకాలంకారంబులు గాకపోవు. శ్రీదేవియు భూదేవియు మీ యుభయపార్శ్వంబుల నుండ నేను మీ కైంకర్యంబు సేయ సమర్థుండఁ గాకుండినను అనంతగరుడ విష్వక్సేనాదిపరివారంబులు మీ కొలువు సేయుదురు. ఇంక నప్రయత్నంబున మీ పేరు నుడివిన మీగు చనుదెంతురు. మీ వెంట నన్నియుఁ జనుదెంచును. మాకు బహువిచారంబుల నలయనేల ? మిమ్ముఁ జేరుకొనుటే యన్నింటికి మూలము. నిత్యానుసంధానం బిందులనే కలిగె. శ్రీ వేంకటేశ్వరా !

## 89

ఈశ్వరేశ్వరా ! చదువం జూచిన సంశయంబులె పుంఖానుపుంఖంబులై తోఁచును. చదువ కూరకుండిన జ్ఞానంబు వొడమదు. మఱి నిన్నుఁ బలుదిక్కుల వెదకెదమని కన్నులం దెఱచిచూచిన లోకవ్యాపారంబులు భ్రమలం బెట్టెడిని. ఱెప్పలు మూసికొన్నను బలుచింతలు ముంచుకొనును. పుణ్యంబులు చేసియైన నిన్నుం గనియెద మనిన నవి బంధకంబయ్యెడిని. చేయకుండిన సర్వనాస్తికుండ నయ్యెద ; నీ యర్థంబొరులతోడ నే యోజించి చూచిన బహుకుతర్కములు వొదలెడి ; మానిన సర్వసిద్ధాంతంబులు దెగవు. జగంబు బహుసందేహాకారణంబు. తత్త్వం బేగతి నిశ్చయింపవచ్చు ? కావున నేమి సేయంగా, నేమి యగునో నీదాసులు వోయినత్రోవ నడచి వారల యభిమానమునం బొదలి నీకు శర ణంటిని ; నీవే వహించుకొని నన్నుం గాచెదవు. శ్రీ వేంకటేశ్వరా !

## 90

శేషశయనా! నే నీమీఁద నేవలన నీ చిత్తంబువెట్టెద? నా యోగంబులు కాంతానందయోగంబులు; నా నియమంబులు రేపుమాపు నన్నపానంబులు గొనుటలు; నానిత్యకర్మంబులు సంసారకృత్యంబులు; నా వ్రతంబులు రాత్రి నిద్రించుటలు; నా ధర్మంబులు శరీరభోగంబులు; నా పదవులు బాల్యకౌమార యౌవనావస్థలు; నా ఘటనలు పుణ్యాపాపంబులు; నా వేదపాఠంబు లన్యోన్యాధిక్కారంబులు; నా పంచయజ్ఞంబులు పంచేంద్రియ వ్యాపారంబులు; ఇవి మా వర్తనలు; నిన్నెంచిచూచిన సకలలోకోన్నతుండవు; నిన్నుఁ బరికించి చూచిన నంతరమహాంతరంబుల నాలోనుండి రక్షించుచున్నాఁడవు; నీ గుణంబు లరుదయ్యెడి; శ్రీ వేంకటేశ్వరా!

## 91

నరహరీ! మొదలనే నోరు మాటలపుట్ట; మౌనం బెట్లు సిద్ధించు? వీనులు గిరిగుహాలవంటివి. ఎవ్వరు మాటలాడినఁ బ్రతిధ్వనులవలె నాదింపుచుండు; అవి వినకుండ నెట్లుండవచ్చు? కన్నులు రూపంబులకు నద్దంబువలె నున్నవి. ఇందు సకలంబును బ్రతిఫలించుచుండఁగాఁ జూడకుండ నెట్లుండవచ్చు? నీ దేహంబు నాఁకలి దినదినము పీడింపఁగాఁ జపులుగొన కెట్లుండవచ్చు? ముక్కున నొక్కొక్కదినము పదిరెయొక్కవేయున్నాఱునూఱుల యుచ్ఛ్వాసములు గలుగఁగా, నాసనలు గ్రోల కెట్లుండవచ్చు? నన్నియు నే ననుభవించిన నేమి నీవు రక్షకుఁడవై యుండఁగా; నేను నీకు గుఱి; నీపాదంబులు నాకుగుఱి; నన్ను నీ వెల్ల విధంబుల రక్షింతువుగాక; శ్రీ వేంకటేశ్వరా!

## 92

ద్వారకావాసా! దేవుండవైన నీకు నాచర్మ మాంసాస్థిమయంబులైన కరంబుల మ్రొక్కుచున్నవాఁడను. పరమపావనంబైన నీ తిరు

మంత్రము నాయెంగిలినోర నుడువుచున్నాఁడను. గోపికలు నీవు రహస్యంబున వినోదంబులు సలిపిన సుద్దులు నావీనులను వినంగడం గెదను. ఏకాంతంబున లక్ష్మీసమేతుండవైన నిన్ను వేళయెఱుంగక సేవింతును. కోమలంబైన నీ తిరుమేను నాకటకుం జూపులఁజూచెదను. నీచిత్తంబు దెలియక యావాహనంబుచేసి పూజించెద; నిది యపచార మో యుపచారమో యెఱుంగ; నేమిచేసినను నీదాసులకు నేర మెంచ నిది నీగుణము. నీవు కలవని వెఱవకుండ మందెమేలమున నపరాధములు చేసెద నోర్చుకొనుము; శ్రీవేంకటేశ్వరా!

## 93

విట్ఠలేశ్వరా! సాహసం బెట్టిదో కాని నిన్ను నడుగరాని ఫలంబు లడుగఁగోరెడునామనంబు. జిహ్వ నాకుందగని పదార్థంబులు నిన్ను డుగ నిశ్చయించుచున్నది. నాగుణం బభేద్యంబైన నీ మనస్సుశోధింపఁ గడంగెడు. నాబుద్ధి తెలియరాని రహస్యోద్యోగంబులు వెదకుచున్నది. నాహృదయంబు నందరాని పదంబులకు నాయత్తపడుచున్నది. నావేడుక నావలన నీకు నయ్యెడు భోగంబు విలోకించును. నన్ను నీవు సంత తంబునుం బాయక నానాభోగంబు లిచ్చి యుపకారంబు లెంచుకొనఁ జేసిన మే లెఱుంగనివాఁడ నపరాధిని; ఏమనివిన్నపంబుచేసెదను? లోక జననియైన నీదేవిం జూచియైనను కరుణానిధివైన నిన్నుఁ జూచుకొనియై నను నన్నుం గావవే; శ్రీవేంకటేశ్వరా!

## 94

త్రివిక్రమా! మీరు సాలగ్రామ చక్రపాణి దేవపూజాశ్వత్థతులసీసేవా గోబ్రాహ్మణవందన తీర్థస్నాన వేదపాఠ తపోయజ్ఞైకాదశీవ్రత దాన సంకీర్తనాదులచేతం గృతార్థులు గండని జనులకుఁ బుణ్యంబుల చూఱ లిచ్చితిరి. ఎదుటఁ గానవచ్చిన మీమూర్తుల నాశ్రయింపనేరక కొందఱు

కానరాని పరమపదంబున నిన్నుఁ జూడఁగోరెదరు. అది మా కెంత దుర్లభంబు ? ప్రత్యక్షంబైన మిమ్ముఁ గొలిచినఁ బరోక్షంబు మీరే యిచ్చెదరుగాక వేగిరింప నేటికి ? మీ రుభయవిభూతినాయకులరు. మిమ్ము నింతశోధింప సమర్థుండనా ? మీదాస్యమే నేఁగోరం గలవాఁడఁ గాక; శ్రీ వేంకటేశ్వరా !

# 95

నరసింహా ! నేను భూలోకంబున నెనుబదినాలుగులక్షల జంతువుల గర్భంబులందు వెడలిననేమి ? నాకు నలయికలేదు. నీవు నా కంతరాత్మవై వెనువెంటఁ దిరుగంగా నీ శ్రీపాదంబు లెంత బడలెనోయని విచారించెద. అదియునుగాక మున్ను స్వర్గనరకాదిలోకంబుల సుఖదుఃఖంబులనుభవించెడి వేళలో నీవు నాలోనుండి నామీఁద దయ నేమనుచుంటివో యని తలంచెద. నే నుపవాసములుండి శీతోష్ణంబుల సహించి తపంబులు సేయుతఱిని నీకు బడలిక సోఁకదుగదా యని యూహించెద. నీకుఁ దిరువారాధన సేయుచో నాహ్వానంబుసేసి యారగింపుసేయు సమయంబున నేమి చవిగాకుండునో యావేళ నెటువలె నుండునో యెఱుంగక కొంకెద. కొండంతవాని నిన్ను సూక్ష్మంబుగాఁ జేసికొని యాత్మలోఁ దలంపఁగా నీకుఁ గక్కసంబయ్యెడినో యని వెఱచెద ; నా సర్వాపరాధంబులు క్షమింపవే ; శ్రీ వేంకటేశ్వరా !

# 96

భీమవిక్రమా ! జ్ఞానంబనియెడి శృంగారంపుఁ దోఁటలోఁ గామక్రోధంబు లనియెడి వరాహంబులు రెండు గుద్దలింపుచున్నవి. శమదమంబు లనియెడి యోదంబులు ద్రవ్వి వానిం బడఁద్రోచెద నంటినా నా పూర్వజన్మ ప్రతిబంధంబు లనియెడి భల్లూకంబులు రెండు నందులోనే ఘోషించుచున్నవి. నీమీఁది యాశాపాశంబు లనియెడు త్రాళ్లు దీసి వానిం గట్టిత్రోయుము. తొల్లి నీవు మాయామృగంబు నేసిన వేఁటకాఁడవు గనుక విన్నవించితి. శ్రీ వేంకటేశ్వరా !

## 97

త్రిదశవంద్యా ! ఈప్రాణు లనేకకాలంబులవారు బహు కల్పంబులం జేసిన బహువిధకర్మంబు లసంఖ్యాంబులు గలవు. అనుభవింపక శక్యముగాదు. వంశంబులం దొక్కరుండు శ్రీవైష్ణవుం డై తేను కుల కోట్లను గృతార్థు లగుదు రని పురాణంబులు సెప్పచున్నవి. ఒక్క సారి మిమ్ము మనస్సునఁ దలంచిన దురవస్థలైన యాపదలు గడచునట ! ఫలపుష్పంబులు మీ పాదంబులపై వేసిన నానాపుణ్యాంబులు చేకూడు నట ! మీ మహిమ లతివిచిత్రంబులు ; చెఱువునీళ్లు చల్లి ఫలము గొన్నట్లు ధేనువులు తృణములమేసి దుగ్ధములు పిదుకునట్లు బిడ్డఁడు తల్లి దండ్రులతో ముద్దులంగురిసి సంరక్షణసేయించుకొన్నట్లు పెద్దలకుఁ జేతు లెత్తి మ్రొక్కి దీవనగొన్నట్లు నీరీతి సులభోపాయంబుల మిమ్ము మెప్పించుకొని మీచేమెప్పలు పుచ్చుకొనియెదము. మాకుం బ్రసన్నుం డవు గమ్ము ; శ్రీ వేంకటేశ్వరా !

## 98

వాసుదేవా ! నీవు సముద్రంబుపైఁ దేరు వఱపి కులాచలంబులు క్రుంగఁ ద్రొక్కి చక్రవాళపర్వతంబు దాఁటి చీకటి నఱికి దివ్యతేజంబు చొచ్చి పోయి బ్రాహ్మణుని కొడుకును దెచ్చితివట ! తలఁచినప్పుడె గరుడవాహనంబును శంఖచక్రాద్యాయుధంబులును రప్పించి యనేక భుజంబులతో వెలుఁగొందుదువట ! సూర్యునికిఁ జక్రంబు మఱుంగు వెట్టి సైంధవుని సంహరింపించితివట ! గోవర్ధనోద్ధారణంబును ద్వారకా నిర్మాణంబును మొదలైన యతిమానుషకృత్యంబు లెన్ని వలసినం గలవు. నీ మహిమలు చెప్పెద నన నవాఙ్మనసగోచరంబు లవి. చాలదే నవనీత చోరత్వంబును, వత్సబాలహరణంబును, గోవత్సపరిపాలనంబును, దామోదరోలూఖలబంధనంబును, కుబ్జాప్రాణ నాయకత్వంబును ; ఇవియే కీర్తులు నెగడించు ; శ్రీ వేంకటేశ్వరా !

## 99

సీతావల్లభా ! నా కవితాకన్యకు నీవు వరుండవు. దైవమానుషంబులు గణపొంతనములు. నా జిహ్వయే పెండ్లిపీఁట. నా మనస్సే తెర. నా సంతోషకళలే బాసికంబులు. నా భక్తియే కంకణంబు. అక్షరంబులే తలఁబ్రాలు. శబ్దంబులే వాద్యఘోషణంబులు. స్మృతిస్వరంబులే పేరంటాండ్రపాటలు. చూపులే మంగళహారతులు. నా వాక్యంబులే పువ్వుదండలు. నీ సహస్రనామములే బంధువులు. నీ యాత్మగుణంబులే శోభనద్రవ్యంబులుగాఁ గైకొని యీరీతి వివాహం బైతివి. ఇంక నా కర్మబంధంబు లూడెఁగదే నీ విట్లు పాణిగ్రహణంబు చేసికొంటివిఁక నీ దేవులు నీవును చిరంజీవులై యుండి సంగీత సాహిత్య నానాలంకారాది పుత్ర పౌత్రాభివృద్ధి వెలయుచు నీ దాసుల రక్షింపవే ; శ్రీ వేంకటేశ్వరా !

## 100

శ్రీపురుషోత్తమా ! కరిరాజుం గాచితివి. కొలువులోపల ద్రౌపది మానంబు నిల్పితివి. ప్రహ్లాదునిమాట లాలించితివి. శరణుసొచ్చిన విభీషణుని రక్షించితివి. రావణకుంభకర్ణాదుల వధియించి లంక నేలించితివి. పాతాళంబు బలికి నొసగితివి. ధ్రువునికి ధ్రువంబుగాఁ బట్టంబు గృపచేసితివి. నిన్నెవ్వ రెఱింగి నుతింతురు వారికి నీ పదవు లిచ్చి రక్షింతువు. శ్రీ వేంకటేశ్వరా !

## 101

కరుణాకటాక్షా ! ఎవ్వరెవ్వరి జన్మంబులు వారివారికి హితవులై తోఁచుచుండం జేసితివి. దేహత్యాగంబులు నిర్బంధముల వెడలిన తెఱంగున మనసులను సమ్మతింపఁ జేసితివి. పాపమూలం బయిన క్రీడనసమయంబులు నన్నపానాదిరుచులు స్త్రీభోగంబులు సుఖంబులై తోఁచుచుండం జేసితివి. కర్మానుభవంబులైన పరలోక సౌఖ్యంబులు, తదనుగుణంబు

లైన దివ్యశరీరంబులు నిచ్చుచున్నాఁడవు. ఈరీతి సర్వజంతుల కవ్యాజాంతరసుఖంబులు గలుగఁగా మాకు నెక్కడ నున్ననేమి ? శ్రీ వేంకటేశ్వరా !

## 102

వేణునాదప్రియా ! నేను బంటనైనందుకు నీకేమిగుణి ? నా నుతుల వల్ల నీకేమిలాభంబు గల్గె ? మఱియు నే మ్రొక్కఁగా నైనఫలము నీ కేమిటికి ? నిన్నుఁగూర్చి యుపవాసతపంబులు చేయఁగా నీవు గట్టుకొనియెడిది యెంత ? నూ నియమవ్రతంబులచేత జన్మంబులు మఱియును మొలపించుచున్నాఁడవు. జీవునికి జన్మమరణంబులు నిర్బంధంబులై తోఁచవు. ఇన్నిటికి నీవు కలుగంగా జంతువులకు సుఖదుఃఖంబులనుభవింప సులభం బాయెను. నీవు దయానిధివి. నిన్నుం గొల్చిన వారికి నీవు కామధేను కల్పవృక్ష చింతామణులై ఫలియింపం గంటిమి. శ్రీ వేంకటేశ్వరా !

## 103

యజ్ఞరక్షకా ! పాపంబు లూరకె యజ్ఞానులమై చేసితిమిగాక మీఁద దాఁచిపెట్టితిమా ? పుణ్యంబు లని కొన్ని వినోదించి నీ కృపం జేయంగా ననుభవించెదముగాక మేము ఫలంబులు మొలవంబెట్టితిమా? యీ రెండు మాలోనుండి చేయించంగాఁ జేసినసేఁతలు, అది మీరెఱింగియుండియును నిష్ఠురము గట్టుకొనక దాక్షిణ్యంబున కర్మంబు లనుచు మొదళ్లు కుదుళ్లు గదలించి మాయలు చేసెదరు. మీ దాసులైన వారు మిమ్ముఁ దలఁచిన మాత్రంబున దోషంబు లపహరించెదరు. మీ రెట్లు చేసిన నట్లాను; లోకంబున 'రాజానుమతో ధర్మః' యనియం ద్రదు; మీ యనుగ్రహంబు మాకు మంచిది రక్షింపవే; శ్రీ వేంకటేశ్వరా !

# 104

క్రాళింగమర్దనా ! జ్ఞానంబును నమ్మి కర్మంబులు విడువంగా నీయాజ్ఞ నుల్లంఘించినట్లగునో యని మనంబున శంక పుట్టెడిని. కాక విహిత కర్మంబులు చేసి చేసిన ఫలంబు నీకు సమర్పించెద నన నీ వవాప్తసకల కాముండవు. ఇది నీ కేమి ఖ్యాతిగా నొసంగెదనని సిగ్గయ్యెడిని. లోక దూషణంబులకు లొంగి కర్మంబులు సేయఁగా బంధకంబు లయ్యెడినో యని చింత పుట్టెడిని. ఇందుల కొకమాట కర్మంబులు జ్ఞానసాధనంబు లంటివి. వేఱొకమాట జ్ఞాన మెక్కుడని యానతిచ్చితివి. లోకులకు రెండుమాటలు కర్మకాండ, జ్ఞానకాండలవలె నిశ్చయించితివి గాని యొకటి నిశ్చయింపవైతివి. ఇందుకు వివేకియైన పురుషుఁడు దనకెంత మాత్రమునకు నధికారము కలిగె నటువలెం జేసికొనియెడిని. నీ వలనం దప్పులేదు ; శ్రీ వేంకటేశ్వరా !

# 105

శ్రీధరా ! దేహధారియైనవాఁడు దివంబున సంసారమత్తుండై రమియించి రాత్రివేళ పగలింటియాందోళనంబు కలలోపలం గని వెఱఁగునొంది. సంసారం బిట్టిది గదా యని వైరాగ్యనిష్ఠుండనై యుండెద నని యొక పుణ్యక్షేత్రంబున వసియించి యచ్చట నొకానొకవేళఁ దొల్లి పుత్రమిత్రకళత్రాదులతో వినోదించినచందంబు దలంచి యామనోరథం బుల నోలలాడి మనస్సు కరఁగఁజొక్కి తెలిసి చూచి యెవ్వరింగానక బట్టబయలు భ్రమిసితిం గదా యని నిర్వేదనం బొరలుచుండు. నటుగావున గట్టిగా పట్టరాని దీమసం బిట్టిదెకదా! ఉల్లివాసన యంటినపదార్థంబునఁ గస్తూరిపరిమళం బంటనేర్చునే ? ప్రాకృతికవాసన యందినవాఁడు మోక్షసుఖంబెట్లు వెదకు ? మీ మాయాప్రపంచం బిట్టిది గెలువరాదు. మీరే దయఁజూడవలయు ; శ్రీ వేంకటేశ్వరా !

## 106

అనిరుద్ధా ! నిత్యంబును జీవులు నిద్రాసమయంబున నంతర్యామివై సంతుష్టుఁడవై యున్న నీయందుఁ బ్రవేశించి యందే. నీవు సృష్టింపగాఁ గలుగని మేల్కొని యింద్రియద్వారంబుల లోకవ్యాపారంబులు చూచి భ్రమయుదురుగాని నీయందు నుండియు ని న్నెఱుంగరు. గర్భంబులలో నున్న శిశువులు తల్లుల రూపెఱుంగనియట్లు నిన్నుఁ దెలియనేరక చదువులలో వెదకుదురు. నీ వున్న నెలవు తమ యంతఃకరణం బని యెఱుంగరు. నే మెటువలె నుండిన నేమి ? నీవు ప్రాసలలో దారమై యున్నాఁడవు. నీ సన్నిధానంబున నున్నవారిని నీవే కరుణింపవలయు; శ్రీ వేంకటేశ్వరా !

## 107

శ్రీహరీ ! భువిలోన శునకసూకరాదుల వానివాని జన్మంబులు సుఖంబు లౌనట్లుగా నడపుచున్నాఁడవు. నరకబాధ లనుభవించు వారికి యాతనాదేహంబు లలవరించి ఛేదన తాడనాదులచేఁ దదంగంబులు మఱియును దొలిపించుచు బాధ ననుభవింపఁ జేయుచున్నాఁడవు. శరీరంబులు నిర్బంధంబులు గావున నిన్నిటికిని నీవు గలుగంగా సుఖదుఃఖంబు లనుభవించుటలు సులభంబాయెను. నీవు దయానిధివి. నిన్నుఁ గొల్చినవారికి నీవు కామధేనుకల్పవృక్ష చింతామణులై ఫలియించుట గంటిమి ; శ్రీ వేంకటేశ్వరా !

## 108

శ్రీకృష్ణా ! నిన్ను గోపికావల్లభుండ వని నియమంబున జపియించిన వారికిం బ్రసన్నుండ వగుచున్నాఁడవు. అవులే ; నీ జారత్వంబుం దడవిన నీకు వేడుకపుట్టెడినో కాక నీ మర్మంబు దడవినవారల నుపచరించుటో కాక యిట్టి ప్రసంగంబులం దలంచిన మనస్సు కరంగునో కాక యహల్యాజారుండ వని నొడివిన నింద్రుండు మెచ్చుచో నీవును నుపేంద్రుండ వని వంశానుచారంబైన వ్రతంబు జరపుటో తెలియరాదు.

మాకు నిన్నింత శోధించి యడుగం బనియేమి? నీకు నిష్టంబు సేయుటే మాకుఁ బ్రయోజనంబు. నీకెంత కాముకత్వంబు ప్రియంబై నంబోలు! నేఁటనుండి మేము నిన్ను శ్రీభూమినీళాసమేతుండవని, వ్రజాంగనా నాథుండవని, అష్టమహిషీప్రాణవిభుండవని, శతోత్తరషోడశ సహస్ర కాంతారమణుండ వని నుతించెదము; శ్రీవేంకటేశ్వరా!

# 109

భూపతీశా! భూలోకంబున నన్నుఁ బలుమాఱు పుట్టించెదనని నీకేమైన వ్రతంబా? నాకు నన్ని వేడుకలు నొసంగెదననియెడు నుదారత్వగుణంబుగాక? నీప్రకృతి నన్ను సతతంబుఁ బాయకుండెడి; నాతోడి దిచ్ఛలంబా, సకలభోగంబులు నన్ను ననుభవింపఁజేసెద ననియెడు మాతృవాత్సల్యంబుగాక? ఈరీతి మీరు పాలించి సంసారసౌఖ్యంబులు ప్రసాదింపఁగా నుల్లంఘించి మోక్షంబు గోరెడు మంకుతనంబు నాకుఁ దగదు. మీరు నియమించినట్లు నిచ్చలు మెలంగుటే నాకు ధర్మంబు. అయినం గాని యింకొకవిన్నపంబు చేసికొనియెద విన నవధరింపుము. నామనంబులో మీరుండవలె, కన్నులను మీ మహోత్సవంబులఁ జూడవలె; వీనుల మీకథలు వినంగావలె. నోటికి మీకీర్తనంబు కృపచేయవలె. నిదియె నాకుఁ బరమపదంబు; శ్రీవేంకటేశ్వరా!

# 110

శ్రీనివాసా! దేహంబులై పొదిగెడిది నీమాయయట. అందులోని చైతన్యంబు నీవట. కోరికోరి సుఖదుఃఖంబు లనుభవించువారు జీవులట. ఇన్నిచందంబులం గలిగెడు ఫలంబులు స్వర్గనరకంబులట. ఇవి యెన్నటికిఁ దెగని కర్మబంధంబులట. ఈ సంసారంబు చేసి కూడఁబెట్టంగా మిగిలిన లాభంబులు పుణ్యాపాపంబులట. ఇవి నీకు లీలావినోదంబులట. దీనికి తుద యేది మొదలేది? ఇటువలె ననాదియై సత్యమై జరగుచున్నది ప్రపంచంబు. ఈ యర్థంబుఁ దెలియఁ దరముగాదు. ఇంక నేమని విన్నవించవచ్చు? మీచిత్తంబు నాభాగ్యము! శ్రీవేంకటేశ్వరా!

## 111

పరమేశ్వరా ! నాశరీరంబు నాకు రథంబు. నాపుణ్యాపాపంబులే గుఱ్ఱంబులు. నాయాసలే పగ్గంబులు. నాకామక్రోధంబులే యాయుధంబులుగాఁ గై కొని జన్మపరంపరల నిహాపరలోకంబుల సంచరించిన విజయపురుషుండ నేను. నీవు జగన్నాథుండ వనఁగా విని యిప్పుడు నిన్నుం గొల్చితిని. సుజ్ఞానధనంబు జీతంబు పెట్టియేలుము. ఇంతకాలంబు నీమాయలం బరగిన మర్మజ్ఞుండ నేను నీకు సేవకుండనై యుండుట నీకు మేలు; శ్రీ వేంకటేశ్వరా !

## 112

రాధావల్లభా ! సకల యజ్ఞంబులకంటె జ్ఞానయజ్ఞం బధికంబనియును, అందులఁ గర్మఫలంబు లన్నియు సమాప్తంబులై పోవుననియును, అది నీవెఱుంగుమనియును, తత్త్వవేత్తలకు దండంబువెట్టి ప్రార్థించి యడిగితేను వారు నీ కీజ్ఞానంబుపదేశించెద రనియును, ముందర నీయాత్మలో నీవే యెఱుంగుదువనియును అర్జునునకు పెద్దలం జూపి చెప్పితివి మొదల; నా తర్వాత నీవే వహించుకొని అన్నిధర్మంబులు నంటువెట్టి నాకు శరణుసొచ్చిన మాత్రాన నే రక్షింతు నని సత్యంబుచేసి యిది యెవ్వరికిఁ జెప్పకుమని యితర తత్త్వము మాని నిన్నె కొలువంగట్టడచేసితివి. అటుగాన కేవలజ్ఞానులకుఁ గర్మంబులు చేయనిదోషంబులు లేవనుటాయెను. ద్విజాతులు నీయాజ్ఞా కైంకర్యంబులు సేయుదురు. కాన యవియును వారలకు బంధకంబులుగావు. నీవు పెట్టినచిక్కు నీవే తీర్చితివి; శ్రీ వేంకటేశ్వరా !

## 113

పాంచజన్యధరా ! అనాదికాలంబున నుండియు జీవులం బాయలేక ఆత్మలోనుండుదు వది యంతకంటెను లాభంబింక నేమి వెదకెడిది? జీవులంటిమా నిత్యులు. వారికై చింతింపవలదు. నీ లీలార్థంబైన శరీరంబులు మోచినవారలుం గావున ప్రాకృతవికారంబులైన సుఖదుఃఖము

లనుభవించిన మంచిదే యేలినవారి పనులయెడం బంటునకు నేమి వాటిల్లిన నేలిక కేకలవు. నీవే రక్షించెదవుగాక అందులకు వెలితెంబని లేదు. నీవు గలవని నమ్మి నిర్భయత్వంబున నుదాసీనత్వంబున నుండవలసి నది. నీదాసులైన వైష్ణవులకు పరమపదంబు సిద్ధంబు. అధ్యులై మిమ్ము మఱచినవారికి సంసారమేగతి. ఇటువంటి లోకుల నీడు వెట్టుకొనవలదు. ప్రపన్నులైనవారలకు నీవు రక్షకుండవు; శ్రీవేంకటేశ్వరా !

# 114

పురాణపురుషా ! అప్రతిహతప్రతాపుండవు. అవాప్త సకలకాముండవు. అఘటనఘటనా సమర్థుండవు. అపార కృపానిధివి, అశరణశరణ్యుం డవు. అసంఖ్యాతకల్యాణగుణుండవునైన నీ వబ్జభవాండంబు నీపాదంబు గోట గీరిన నీరై పాఱెను. నీవు గావలయుననిన నర్జునుని ప్రతిజ్ఞ కొఱకుఁ బగలు రాత్రి యయ్యెను. ఇటువంటివి నీమహిమలు. ఘంటాకర్ణుండు నెక్కడ మొఱలిడె? కుబేరుపట్టం బెక్కడఁ గరుణించితివి ? సరయూ తీరంబున పరమపదంబు చూఱలిచ్చితివి. ఇప్పుడు శేషాచలంబునందు వరంబు లొసంగెదవు. నీవు గరుణించిన నీకసాధ్యంబేది ? నీకిది సహ జంబు; శ్రీవేంకటేశ్వరా !

# 115

భక్తవత్సలా ! కన్నులెదుట గోచరించిన వన్నియును నీరూపంబులే. శబ్దంబు లన్నియు నీయనంతనామంబులే. జలంబు లన్నియు నీ శ్రీపాదతీర్థంబులే. ఫలమూలాదు లన్నియు నీప్రసాదంబులే. జీవకోట్లు నీదాసులే. తలంపున నిల్చినవి నీధ్యానంబులే. చేతులఁ జేసినవన్నియు నీకైంకర్యంబులే. జగంబు వైకుంఠంబే. యజ్ఞంబులు మహోత్సవంబులే. సకలసంపదలు నీయుపకరణంబులే. ఇటువలె భావించియేకదా నీభాగ వతులు భవంబులు గెల్చిరి, ఇహపరములు చెందిరి; శ్రీవేంకటేశ్వరా !

# 116

గదాధరా ! బుద్ధిమంతుఁడైన యతండు దేహధారణమాత్రంబులు సుంతభోగంబులు గైకొని యితరంబు లేమియుఁ గోరక అంతరంగంబు

నకు నిఖిలవస్తులాభంబులు నీపాదంబులేయని తలంచుకొని తృప్తింబొంది యేకాంతంబునందే కాని సంసారంబు చేయుచుండి కాని నిన్ను ధ్యానంబు సేయుట యోగరహస్యంబు. ఇదియే తపంబు. ఇందులనే సకలసిద్ధులును సిద్ధించు. తొల్లిటి మును లీరీతినే నిన్ను భజియించి ఘనులైరి. మఱి కొంద ఱీమార్గంబున నేమియుం గోరక మీ శరణుసొచ్చి మిమ్ముఁ గొల్చి ముక్తులైరి. కావున మునుపడి సేవించు నుద్యోగంబులు జీవులవి. తర్వాత రక్షకత్వంబు నీది; శ్రీవేంకటేశ్వరా!

## 117

త్రిగుణాతీతా! చతుర్భుజాకారా! కానరాని బ్రహ్మము నెవ్వరుఁ జూపలేరు. కానవచ్చియున్న నీమాయ లెవ్వరు మాన్పలేరు. కలది భక్తసులభుండవని చదువులలో నిన్నుఁ జెప్పంగాఁ జెవులు చల్లంగా వినుట యొకటి, కన్నుల పండువుగా నీమూర్తులు దర్శించుట యొకటి, నీరూపులు మనంబునఁ దలపోయు టొకటి, కరంబుల నీకు మ్రొక్కు టొకటి, నీనామంబులు జపియించు టొకటి. ఇంతియకాని వేఱొక్కయుపాయంబు మఱిలేదు. విచారించిన నాత్మ పరమాత్మదర్శనంబు లసాధ్యంబులు. కర్మంబులు కోరి చేసిన బంధంబులగు. కోరక చేసిన నిన్నుఁ గనుఁగొనుటకు; నన్ని చందంబుల మీకు శరణనుట మేలు; శ్రీవేంకటేశ్వరా!

## 118

రుక్మిణీవల్లభా! మహాపాతకంబులు చేసిన జీవులు పాషాణంబులై వృక్షంబులై తృణగుల్మలతాదులై పుట్టుదురని చెప్పుదురు. జగంబంతయు నివియ నిండుకొనియున్నవి. బ్రహ్మాండంబును పాపంబు నిండుకొన్నది. చెప్పవే, యెట్లాయహల్య నీపాదంబుసోకి పాషాణత్వం బుడిగి పావనం బయ్యె? నిటువంటి యీ చరాచరముల నంతర్యామివై నిండుక యుండఁగా నీ జీవులపాపంబు లప్పుడే పోయిన బాధితానువృత్తి నున్నవియో కాక వారి నిర్బంధంబులు దోఁచకుండంజేసి మీ లీలకుం గైంకర్యంబు గొనుచున్నాఁడవో కాక మీ ధ్యానకల్పన ఘటియించుకొన్నాఁడవో; శ్రీవేంకటేశ్వరా!

## 119

దేవచూడామణీ ! మీస్వరూపంబు మితివెట్టి తెలియంగారాదు. తెలియకుండిన నాకు బ్రహ్మజ్ఞానంబు సిద్ధించు టెట్లు? శాస్త్రమార్గంబున యుక్తులు వెదకిన మీఁద మీఁదఁ బెరుగుచున్నవి గాని యవధిలేదు. మీగరిమ యెట్లునిశ్చయింపవచ్చు? మీరుండుత్రోవ లెఱుంగరానివని సందేహింప నేటికి? అన్నిట మీదాసుండనని యుండుటేచాలు; నదియే సులభోపాయం బని నిశ్చయించి చెప్పితివి. మున్నిటిపెద్ద లిందు వలననే నీచిత్తంబు గరఁగఁగొల్చిరి. ఇదే పరతత్త్వజ్ఞానంబునకు మూలం బని నామనంబున సన్నుతించి పతివ్రతాభావంబున దాస్యంబునకుఁ గంకణంబు కట్టుకొంటిని. ఇది నావిన్నపంబు; శ్రీవేంకటేశ్వరా !

## 120

లక్ష్మీవల్లభా ! నీ వజాండంబున కాధారకూర్మంబవట. మీఁదట నీ బంటు శేషుని ఫణంబులమీఁద సకలలోకంబులు నున్నవి. ఆదివరాహంబవైన నీకొమ్మున భూమి నెలకొన్నది. మత్స్యావతారంబున నీచేత వేదంబు లుద్ధరింపఁబడెను. సకలైశ్వర్యంబులకుం గారణంబయిన శ్రీదేవి నీదేవి. సూర్యచంద్రులు నీ కన్నులు. మూఁడులోకంబులు నీపాదంబునఁ గొల్చినవి. బ్రహ్మ నీకొడుకు. ఇటువంటి బ్రహ్మాండంబులు నీ రోమకూపంబుల ననంతంబులై యున్నవి. ఇటువంటి దైవంబు లెవ్వరున్నారు? నీకీర్తిప్రతాపంబుల కెదురేది? శ్రీ వేంకటేశ్వరా!

## 121

శ్రీ తులసీవల్లభా ! ఇంద్రజాలములు చూపువాఁడు బట్టబయలు సముద్రంబుగా నేదును. దివాంధములు పగలు చీకటిగాఁ దలఁచును. భ్రమసినవాఁడు రజ్జువు సర్పంబుగాఁ దెలియును. నీమాయచేత మోహితుండైనవాఁడు నీప్రభావం బెఱుంగక తన సామర్థ్యంబు లని యహంకరించును. నీయవతారంబులు మానుషంబులుగా నెంచును. ఇటువంటి వారలకు నీపరతత్త్వము తెలియదు. నీవు పుట్టించిన నాస్తికులైనవారి

వినిపింప నెవ్వరితరము? మీరె కరుణించినప్పుడు మధురమయ్యెడుఁగాక! శ్రీ వేంకటేశ్వరా !

# 122

సామగానప్రియా ! లోకరక్షణార్థంబు నీ వవధరించిన రామకృష్ణావతారంబులను కర్మపాశబద్ధులైనవారు తమసాటిగాఁ దలఁతురు. వారు మీతో సరి యేల యయ్యెదరు ? సర్వోత్కృష్టుండవని యెఱుఁగనివారికదియేల రుచియించును? సర్పదష్టులైనవారికేమి దినినఁజప్పనుండినట్లు మాయాసర్పములు తలకెక్కిన తమ్ముఁ దామెఱుంగక నిన్నుఁ దమసాటి కెంచుకొంచున్నారు. కటకటా! యేమి యందు. సకలరక్షకుండవని మహాపురుషులు నిన్నుఁగూర్చి తపంబులుసేసి మహత్త్వంబులు వొందుచున్నారు. మీఘనత కిదియె దృష్టాంతంబని యెంచఁదగును; శ్రీ వేంకటేశ్వరా !

# 123

శ్రీవత్సలాంఛనా ! నీవు బలవంతుండవు. ఎట్లుచేసిన నట్లగు. గౌతమీనది జలంబులకుం దగిలినశాపంబు పరిహరింప శబరిస్నానతీర్థంబు గారణంబు చేసితివి. ఇదేమిచిత్రమో? బ్రహ్మర్షియైన దుర్వాసు నాపదమాన్ప నీభక్తుండైన యంబరీషుని గుఱిచేసితివి. హీనాధిక్యంబులు విచారించిన నెంతకెంత యంతరము! మీదాసులప్రభావంబు లిట్టివని లోకులకుం దెలిపితివి. ఏమని నుతియింతుము నీమహిమ ! శ్రీ వేంకటేశ్వరా !

# 124

త్రాటకాంతకా ! నేను రాజస తామసగుణంబులం దగిలి మదోన్మత్తుండనై యున్నవాఁడ; నే బుద్ధిమంతుండ నౌటయెన్నఁడు ? పూర్వజన్మంబున నే ననుభవించిన సుఖదుఃఖంబులు దలంచినైనను, గొంత చక్కటికి వచ్చెదనంటినేని, జాతిస్మరత్వంబు లేదు. నరకబాధలఁ దలఁచుకొని యెదనంటినేని నవి నాఁడె మఱచితిని. భువిలోపల శునక సూకరాదులను సంసారబాధలం బడెడివారి తర్జనభర్జనాదులుచూచి విరక్తుండనయ్యెద

ననినఁ బురాణవైరాగ్యంబెకాని దృఢంబుగాదు. నా మూఢత్వంబు విచారించెదవో! ఇన్నింటికిం బ్రేరేపకుండవు గనుక నీమఱుంగు సొచ్చితిని. నీవె నన్ను శుద్ధసత్త్వసంపన్నుఁ జేయవే; శ్రీ వేంకటేశ్వరా!

## 125

సుబాహుదైత్యమర్దనా! నేను మంత్రసిద్ధి పడయుట కొఱకుఁ గుత్తుక బంటి జలంబులలోపల నుండెదననుచు, ఋషియయ్యెదు కొఱకు వనంబులలోపలఁ దపంబుచేసెద ననుచు, గాయసిద్ధివడయుకొఱకు సత్త్వౌషధంబులుచేసి సేవించెద ననుచు, సిద్ధగంధర్వపదంబునం బొందెదు కొఱకు మహాయోగంబులు సాధించెద ననుచు, ననేకోపాయంబుల యాశలం బొరలితిని నావివేకం బేమనిచెప్పెడిది? ఇవి యన్నియు నిర్బంధంబులైన బంధంబులెకాని, మోక్షమార్గంబునకుం బ్రయోజనపడవు. చిరంజీవుండనై యుండుదుఁ గదాయని యాసపడి యెన్నాళ్లుండినను, మీ మాయయైన జగత్తునఁ ద్రిమ్మటలే. కాని బ్రహ్మలోకంబు దాఁట రాదు. ఇందుల కింతపనియేల యివ్వాడు? బుద్ధిమంతుండనై తిసి. మిమ్ముఁగొల్చి మీరేగతియనియుండంగా, మీరు వలసినట్లు చేసెదరు; శ్రీ వేంకటేశ్వరా!

## 126

యదుకులతిలకా! కర్మంబులుచేసి మిమ్ముం గనియెద ననిన నది ఘన తిమిరమధ్య దర్పణావలోకనంబు. చదువులు చదివి మిమ్ముఁబట్టెద ననిన నది బకబంధనప్రయాసంబు. తపంబుచేసి మిమ్ము వశంబుచేసికొని యెదమని తలంచిన నది శేషమస్తకమాణిక్యగ్రహణంబు. ఉపవాస వ్రతంబుల మిమ్ము నాదరించెద ననిన నది సముద్రసేతుబంధనంబు. దానంబు లొసంగి మిమ్ము నాకర్షించెదమనిన నది యాకాశపాశబంధనంబు. నీ వీ యుపాయంబులచేత నసాధ్యుండవు. నీవొక్క భక్తిచేతనే సాధ్యుండవు. ఇందుకు దృష్టాంతంబు మీకు శరణుసొచ్చిన ప్రహ్లాద నారద శుక భీష్మ విభీషణ కరి శబరీ గుహాక్రూర విదుర హనుమత్ప్రభృతులైన పరమభాగవతులు లోకంబులం బ్రఖ్యాతులయిరి. నిన్ను నొక్కని భజియించి నిశ్చింతనుండెదము; శ్రీ వేంకటేశ్వరా!

## 127

గోపాలబాలకా! నిన్ను నెఱుంగనిశుష్కజ్ఞానంబు పాషాణ కంటక క్రూరసర్ప వరాహ శార్దూల భల్లూకాక్రాంతంబైన యరణ్య మధ్యంబువంటిది. మీదేవాలయంబులు లేనిచోట్లు కఠినకర్కశతిమిర దురవగాహపిశాచశునకావాసంబుల వంటివి. మీకు విరహితంబులైన పూజలు నిబిడ నిర్ఘాత విద్యుత్పాత ఝంఝామారుతవర్షంబులైన సముద్ర మధ్యంబులవంటివి. మీ కథలు లేని పురాణశ్రవణంబులు భీకరాకార కాకఘూకకంకగృధ్ర ఝిల్లీ పాషాణ గుహాలలోని ప్రతిధ్వనులవంటివి. ఇవి యెల్లను మహాత్ములగువారు దలంపరు. మిమ్ము నమ్మి సర్వశుభం బులు మీయందె ఘటియించుకొందురు. వివేకు లయిన మీదాసులకు నిదియె యుపాయంబు. శ్రీ వేంకటేశ్వరా!

## 128

పూతనాశిక్షకా! గ్రహణకాలంబునంజేసిన స్నానంబునకు గంగాస్నా నంబు సరియని చెప్పుదురు. పుణ్యక్షేత్రంబుల నుండెడివారిని ఋషి సమాను లని యంద్రు. సత్పురుషులైనవారి హస్తంబునం బెట్టిన సువర్ణంబు మేరుసమానంబని పలుకుదురు. కాలకృతంబులైన యనుష్ఠా నంబులు సఫలంబులని వచియింతురు. అన్నిటి మాహాత్మ్యంబు మీయందే యున్నది. గంగాజలంబు మీపాదతీర్థంబు. ఋషిత్వంబు మీదాస్యంబు. దానఫలంబైన సువర్ణంబు శ్రీమహాలక్ష్మి ప్రసాదంబు. అనుష్ఠానజపం బులు మీనామస్మరణ సులభంబులు. ఇన్నియును మీవలననే మాకు సిద్ధించె. ఇన్నిటం బరిపూర్ణులమై యున్నారము. వెన్న చేతఁబెట్టుకొని నేతికై వెదకనేమిటికి? పరుసవేది యింట నుండఁగా బంగార మడుగ వలెనా? మాకు మీరు గలరు. ధన్యులమైతిమి శ్రీ వేంకటేశ్వరా!

## 129

లోకనాథా! నేను జ్ఞానం బెవరినైన నడిగి తెలిసికొనియెద నంటినేని శాస్త్రాధీనుండు బ్రాహ్మణుండు. గృహస్థుండు పుత్ర మిత్ర కళత్రా

ధీనుండు. రాజు రాష్ట్రాధీనుండు. ప్రధాని కార్యాధీనుండు. జపిత మంత్రాధీనుండు. తపస్వి దైవాధీనుండు. ఈరీతిని వారువారు మనస్సులు తమ తమ కర్మంబులందే యెడంబడ వర్తింతురు. కాని నిన్ను నొక్కనినే కొలిచితేను నీవలన నన్నియుం గలవనియెడు విశ్వాసంబు వారికిఁ గలుగ నేరదు. వారు నన్ను నెట్లు బోధించెదరు. విత్తొకటి వెట్టినఁ జెట్టు వేఱొక్కటి మొలచునా ? అవి నీకృత్యంబులు. నేను వైష్ణవుండను. ఆచార్యాధీనుండను. నీవు భాగవతాధీనుండవు. నన్నుం గరుణాదృష్టి నవలోకింపవే. శ్రీ వేంకటేశ్వరా.

# 130

ఆదిమధ్యాంతరహితా ! ఆకాశంబున భూమిం బురుడింప వచ్చును. అనంతమైన నీమహిమకు నీడు లేదు. సముద్రంబునెంచి మేరుపర్వతంబుఁ బోలించవచ్చు. నీకరుణాసముద్రంబునకు సరిచెప్ప నలవిగాదు. సూర్యుని తోడఁ జంద్రుని జోడు చెప్పవచ్చును. నీ కోటిసూర్య తేజంబునకుం బ్రతిలేదు. బడబాగ్ని నగ్నిదేవునిఁ బోల్పవచ్చును. నీప్రతాపాగ్నికి సాటి యుపమింపరాదు. చుక్కలను జ్యోతిశ్శాస్త్రంబుల లెక్కింపవచ్చునుగాని యపారంబైన నీ నామంబుల ప్రభావంబులకు నేమియు మితివెట్టరాదు. ఏకోదకంబైనపుడు నీవొక్కడవే నారాయణుండవై యుండుదువట నీకు నీవే యీడు. ని న్నెంతని కొనియాడుదుము. అందఱకు నీ వొక్కరుండవే గతి. శ్రీ వేంకటేశ్వరా !

# 131

భక్తచింతామణీ ! నేను విలాససంకల్ప బాధితుండనై యజ్ఞానం బనియెడియగాధ జలంబులలోన మాయావర్షాగమనంబునం దపంబు సేయుచున్నవాఁడ. అంగనాలింగనాకాశమధ్యంబుననుండి వదన చంద్రునిపై దృష్టినిలిపి యూర్ధ్వబాహుండనై తపస్సు చేయుచున్నవాఁడ. అష్టాశీతి బంధంబుల యాసనంబులనుండి మదనదైవతాగమంబున నిట్టూర్పులను ప్రాణాయామంబులం దపంబు చేయుచున్నవాఁడ. క్రోధాగ్ని పాతకేంధనంబులు దరికొల్పి తపంబు సేయుచున్నవాఁడ. ద్రవ్యార్జనచింతాది

కామ్యకర్మ ఫలాహారినై తపంబు సేయుచున్నాఁడ. ఆశాపర్వతంబు మీఁద నతిదైన్యసూచ్యగ్రంబునం దపంబు సేయుచున్నవాఁడ. సంసారంబనియెడి పుణ్యక్షేత్రంబునను పుత్రదారాదు లనెడి సాకారులగు నిధులు కన్నులెదుటం జూచి చూచి ధ్యానయోగంబుతోడుతఁ దపంబు సేయుచున్నవాఁడ. విచారించి చూచితే యన్నిచందంబుల నుండెడి వాఁడవు నీవే. ఈతపంబులన్నియు గల్పించినవాడవు నీవే ఈతపంబులన్నియుఁ జల్పించినవాడవు నీవే గురుండవు దైవంబవు రక్షకుండవు నీవే మమ్ముఁ గరుణింపుము. శ్రీ వేంకటేశ్వరా!

# 132

దయానిధీ! నీవు మన్నించి భాండారంబు దెఱచి భూరిదానంబు లొసఁగఁగా సకల వైష్ణవులును నీపై భక్తిసంపదను తమ తమ యాత్మమందిరంబులలోన దాఁతర పెట్టుకొనిరి. నీనుతులు మూటగట్టి వదనసౌధంబుల లోన తూఁగవేసికొనిరి. నీనామాంకితంబులు దేహముతో లంకించి తిరుమణి గుఱుతులు వేసికొనిరి. నీమూర్తిధ్యానంబు మనస్సనియెడి గోడల నంటించిరి. నీపూజాంగంబులు పిడికిళ్లఁ బట్టుకొని యున్నవారు. నేను వారిలోని వాఁడనే. నీకృపాదృష్టి మాపై గురిసె. ఇంక మాకు ననావృష్టి దోషంబు లేదు. నీధర్మంబున పరిణామంబున నుండెదము. శ్రీ వేంకటేశ్వరా!

# 133

విజయప్రకాశా! కార్యాతురుండనై మందెమేలంబున మాటిమాటికి నిన్నుఁ దలంపుచున్నవాఁడను. నిన్నుఁదలంచి చూచితేను బ్రహ్మదేవునిలోని సామర్థ్యంబు నీవ. ఇంద్రునిలోని యైశ్వర్యంబు నీవ. సూర్యునిలోని తేజంబు నీవ. చంద్రునిలోని కళలు నీవ. వాయువులోని వేగంబవు నీవ. సకల దేవతలలోని ప్రాభవంబులు నీవ. అన్ని తీర్థంబులలోని పుణ్యంబులు ప్రభావంబులు నీవ. యజ్ఞదాన కర్మానుష్ఠానంబులు నీవ. ఇటువంటి నిన్ను సాధించనెట్లువచ్చును. నేను మనుష్య మాత్రదేహిని. మీరెంత నేనెంత, ఊరకే మిమ్ముఁగొలిచిన

బంటనని పెద్దటికంబులకుఁ జెప్పుకొనియెదనుగాక, మిమ్ముఁగనుఁగొన నెంత సమర్థుఁడను. నా యగ్గలికకు నేను నన్ను నవ్వుకొనుచున్న వాఁడను. నా యాస చూచి నన్నుఁ దయదలంచి యేలుకొనవే శ్రీ వేంకటేశ్వరా!

## 134

మధుకైటభాంతకా! జంతువులము మేము ఆహార నిద్రలతో నోలలాడుచున్న యెడ నిన్ను నొకానొకపరి మా పాలింటి దైవమవని తలంచుచున్నారము. మాజ్ఞానంబు లల్పంబులు ననాచారబహుళంబులు నయినట్లున్నవి. మాయునికి పెక్కురంగుల చెట్లలో నొకజిల్లేడుఁ జెట్టువలె నున్నది. బంటులకు నీవేమి చేసెదవో! నేము మిమ్ము సదా సేవింప నేరమి చింతింపుచున్నారము. నిన్ను నిర్హేతుక దయానిధివని పెద్దలు చెప్పుదురు. నీ బిరుదులు దలంచుకొని మాపై కృపాకటాక్షము దయసేయుము శ్రీవేంకటేశ్వరా!

## 135

విభీషణస్థాపకా! ఈ మనుష్యలోకంబున రవి చంద్ర గ్రహ తారకంబులవలన నుదయాస్తమయంబులును పూర్వదక్షిణ పశ్చిమోత్తరంబులును నేర్పడియున్నవి. ఇంద్రాదులకు దేవమానంబున నివియే శతగుణంబులై యున్నవి. అట మీద బ్రహ్మకు బ్రహ్మమానంబున ననంత గుణితంబులై యున్నవి. ఇందులకు జ్యోతిశ్శాస్త్రంబునం జెప్పెడి కాలంబునకు . నేకవాక్యతఁ గల్పించి యేలాగున సరిపఱిచి చెప్పవచ్చును. శాస్త్రంబులు కల్లనరాదు. అయితే వీనికతంబున నీవే గాలాత్ముండవై ఇక్కడనక్కడ నిన్ని చందంబులతోడఁ జూపెడి నీ స్వతంత్రంబు గానంబడియెను. జగత్తంతయును నీ మహిమనే యున్నదను నిశ్చయము తేటతెల్లమాయెను. సర్వంబు నీ కల్పితంబై చెల్లుబడియవుట, నిశ్చయంబు. పుట్టించుటకు రక్షించుటకు నీ వొక్కరుండవే కర్తవు. పరమేశ్వరుండవు. అఘటనా ఘటన సామర్థ్యంబు నీకకలదు. నీచేతలు పొగడుచున్నారము శ్రీ వేంకటేశ్వరా!

## 136

ఉద్ధవ వినుతా ! సర్వమైననారికి నీవాహారంబు గొనువేళను ఆయా పదార్థంబులరుచులు జిహ్వాలకొకరీతివె. తరుణీసంగమంబులు నొక్కచందంబులె, వీనుల వినియెడి వినికియును నొక్కజాడయె. ముక్కులా ఘ్రాణించు పరిమళంబును నేత్రంబులం జూచిన తెలివియును నొక్కతీరె. విచారించితే అనుభవంబులయెడనేక సూత్రంబె అవుచున్నది. ఓహో ! నీ ఘటన యత్యాశ్చర్యంబు, అన్నిట నేర్పరివాడు శ్రీ వేంకటేశ్వరా!

## 137

కంసమర్దనా ! నీవు ఆదివిష్ణుండవు. నీ యాత్మసంభవుండైన బ్రహ్మదేవుండపరవిష్ణుండు. అతనిచేత సృజింపఁబడ్డవారందఱు వైష్ణవులే. "సర్వం విష్ణుమయం జగత్" అందురుగావున నందఱును మీయధీనులే. వారి వారి పూర్వజన్మానుగుణ్యంబునం గొందఱు శైవులగుదురు. కొందఱు మాయావాదులగుదురు. అందులకు నింక నొక్క విశేషంబు గలదు. దేవతాంతర మతాంతర సాధనాంతర ప్రయోజనాంతరములు విడిచి తదేకనిష్ఠులై మిమ్ముఁ గొలిచినవారు పరమవైష్ణవులు. విదురుని యంతరంగులు. ఇతర మతంబులవారునిన్నెఱింగిన నెఱుంగకుండిన సకల దేవతలును నీ యంశసంభవులుగనుక నా దేవతలఁగొల్చినవారును నీవారే శ్రీ వేంకటేశ్వరా !

## 138

అహల్యాశాపవిమోచనా ! నీవు సర్వంబునకు నాధారంబని వేదంబులు చెప్పుచున్నవి. నీకు నాధారం బెయ్యదియో యెఱుంగను. నీవొక్కండవే పరబ్రహ్మవట ! పురాణంబులు సెప్పెడి. తక్కిన మూర్తిభేదంబు లెవ్వరెవరో యెఱుంగను. నీవేమిటం బొరయనివాఁడవట ! ఈప్రపంచం బెవ్వరికొఱకుఁ బ్రకాశింపుచున్నయదియో కానఁబడదు. ఇవి యన్నియును విచారించిచూతమనిన నీవభేద్యుండవు. ఇటువంటి నీ మహిమకు నేము నాశ్చర్యంబు నొందుట గాని యొకయర్థంబు నిశ్చయింప నలవిగాదంటిని. తిలలలోని తైలంబువిధంబునఁ, గాష్ఠంబులోని యనలంబు

చందంబునఁ, బుష్పంబులోని పరిమళంబుపోలిక, బీజంబులలోని వృక్షంబులకైవడి నీరీతి జగంబులలోన నీవును, నీలోన జగంబులును; బాహ్యాంతరంబుల నీవు పరిపూర్ణుండవై యున్నాఁడవు. నీవు వలసినట్లుండుము. నీకు శరణని బ్రతికెదము. శ్రీ వేంకటేశ్వరా !

## 139

కల్క్యవతారా ! మిమ్ముఁ గొలిచిన సాధుజనంబులకు వరదహస్తంబును, భయపడ్డ దీనులకు నభయహస్తంబును జూపుకొని సాకారమై నిలుచున్నవాఁడవు. శత్రుసంహారార్థంబై యొక శైలచక్రంబును విజయఘోషంబులందఱకును నెఱిఁగించుకొఱకు నొకచేత శంఖంబును బెట్టుకొని యున్నాఁడవు. ఇంక నే మూహించి యాసపడి వెదకెడిదేమున్నది? కోరకే తొల్లి సర్వార్థంబులు నొసఁగ నంతర్యామివై కాచుకొని యున్నాఁడవు. వెదకం బోయిన తీగ ముంజేతఁ దగిలినట్లు, వేఁడఁబోయిన యర్థంబు వేడుకవచ్చినట్లు, ఆడఁబోయిన తీర్థంబెదురుగా వచ్చినట్లు, తొల్లి చేయని పుణ్యఫలంబులు చేతికివచ్చినట్లు సకల తిరుపతులం బొడచూపుచున్నాఁడవు. సకలమైనవారికి బ్రదుకుఁద్రోవలు నీవుండిన యాకారంబు చెప్పుచున్నది. శ్రీ వేంకటేశ్వరా !

## 140

రవిచంద్రలోచనా ! మావేడుకకు నీప్రత్యక్షంబుఁ గోరెదము గాక నీవు ప్రత్యక్షంబయిన నెట్లు కనుఁగొన నోపుదుము. నీవు కోటిసూర్యప్రకాశుండవట. ఒక సూర్యుండు దృష్టులకు మిఱుమిట్లు గొల్పెడిని నీవెట్లు గోచరించెదవో యద్భుతంబు. శ్రీవేంకటాద్రి మీద నీరూపంబు దర్శించితిమి. మాకు నిదియె బ్రహ్మసాక్షాత్కారంబు శ్రీ వేంకటేశ్వరా!

## 141

జగత్ప్రాణా! బ్రహ్మచర్యంబుననుండి సాధించు ఫలమును గృహస్థాశ్రమంబునంజేసి చెందెడి పుణ్యంబును, వానప్రస్థధర్మంబునం గట్టుకొనియెడి విశేషంబును, యతినిష్ఠచేతఁ బొందెడి యానందంబును నీదాస్యంబునన

సాధించుకొంటిని, నానా వేదంబులం జదివిన యాధిక్యంబును నీ నామో
చ్చారణంబునఁ గలిగించుకొంటిని. అఖిలలోకంబుల సౌఖ్యంబులు మీ
గుడిపంచనే దొరకించుకొంటిని. అమరత్వంబు వైష్ణవత్వంబునం
గైకొంటిని. అన్ని తీర్థంబుల స్నానంబులును గంగాస్నానములో
నిలిచినట్లు, మంత్రజపంబులెల్లను బ్రణవంబులోఁ జిక్కినట్లు తపంబుల
మాహాత్మ్యంబులు భక్తిచేతం దక్కినట్లు నీ కృపవలన నాకు సంభ
వించెలే శ్రీ వేంకటేశ్వరా !

## 142

కూర్మావతారా ! బ్రహ్మాండం బొకటి, బ్రహ్మలు తొమ్మండ్రు, రుద్రులు
పదునొకండ్రు, దేవతలు ముప్పదిమూఁడుఁగోట్లు. ఇందఱిలో నెవ్వరి
ననుసరించెదము. అందఱకును మూలకారణం బైనయాదిమూర్తివి
నీవని నిన్ను నొక్కని గొలిచితిమి. ఇంక నిందఱును దృప్తులై మాకుఁ
బ్రసన్నమయ్యెదరు. అదేగదా వృక్షంబునకు మొదటఁ బోసిన నీరు
కొనలకెక్కి తనివిఁబొంది ఫలించు; నటువలెనే మీ చేత నిర్మింపఁబడిన
దేవతలందఱును మిమ్ముఁజూచి మాకుఁబ్రసన్న మయ్యెదరు. బహు
మార్గంబులం దగిలితేను మనస్సు చలియించును. ఏకాగ్రబుద్ధిని మిమ్ము
సేవించెదము, శ్రీ వేంకటేశ్వరా !



## 143

సముద్రసేతుబంధనా ! నీవలన నీసంకల్ప రూపంబైన ప్రకృతియును
బ్రకృతివలన మహత్తును, మహత్తువలన నహంకారంబును, నహం
కారంబువలన మనస్సును, మనస్సువలన సకలేంద్రియంబులును, బంచ
తన్మాత్రలు జనించె. ఆ తన్మాత్రంబులవలన పంచమహాభూతంబులును
బొడమె. కూడ నిరువదినాలుగు తత్త్వంబులయ్యె. ఆ యిరువది నాలుగు
తత్త్వంబులైన జీవులలో నీవు వేంచేసియుండి ప్రకృతి భోగంబులన్నియు
ననుభవింపఁ జేయుచున్నాఁడవు. నీవు ప్రాణబంధుండవై లోకంబు
లేలుచున్నాఁడవు. నిన్ను వేఁడుకొనియెదము. నీకుఁ బ్రియంబుఁ జెప్పె

దము. గురుముఖంబునను నీ కృపవలనను స్వామి వని నిన్ను నెఱింగి కొంటిమి. నీవు పెట్టినచట్టు నీవే యీడేర్పవలయును. తరువాతి బుద్ధులు నీవే యనుగ్రహించి మమ్ముఁ గృతార్థులం జేయవే శ్రీ వేంకటేశ్వరా!

# 144

వాలినిగ్రహణా! నీపై భక్తిఁ జేయునదెల్ల నన్ను నీవు రక్షింతువని యెడిన్వకార్యంబు కొఱకే. నీవు మమ్ముఁ బాయక యంతర్యామివై యుండెడిదంతయును నీవు మాకుఁజేసిన పరమోపకారంబే. నే నస్వతంత్రుఁడ. నీవు స్వతంత్రుఁడవు. నే నగుణుండ. నీవు గుణాతీతుండవు. నే నశక్తుండ. నీవు సర్వశక్తిధరుండవు. నే నిన్ను ధరించుకొననోప. నీవు నన్ను ధరింపనోపుదువు. నానేరుపునేరము లెంచం బనిలేదు. నీ కీర్తి ప్రతాపంబు లెంచుకొని నీ మహిమలు మెఱసి నన్నుఁ బోషించుట నీకుం బుణ్యము. ఎలుఁగుబంటికి జూలు ప్రేగనరాదు. తీగెకుఁ గాయ భారమనరాదు. కామధేనువునకుఁ గొమ్ములువేస టనరాదు. మా చిరభారంబులు నీవే వహించుకొనవే శ్రీ వేంకటేశ్వరా!

# 145

మారీచహరణా! నీవు ధర్మసంస్థాపనంబు సేయునెపంబువలన ననంతావతారంబులై యపరాధంబులు సేసిరని దుర్జనులైన రావణాదులను సంహరించితివి. ఊరకున్న జీవులచేతను బాపంబులు సేయింపనేల? వారిని రాక్షసులుగాఁ బుట్టింపనేల? నీవు జన్మంబు నొందనేల? మొదలనే సుజ్ఞానులం జేసిన నీకేమి వెలితియయ్యెడిని. నీవు స్వతంత్రుండవు. నీవు లేక జగంబులోనఁ దృణంబు సలింపదని యంద్రు. నిన్ను మీఱిన పనులేమియున్నవి. నీవు తప్పునేయువనుతలంపున మే మొకటియెంచు కొంటిమి. దేవతిర్యఙ్మనుష్య స్థావరాదులకు నీయవతారంబులు సేవించి బ్రతుకుం డనియెడి యుపకారంబు గాఁబోలు నియ్యది. శ్రీ వేంకటేశ్వరా!

## 146

శ్రీమన్నారాయణమూర్తీ! శ్రీరంగంబునకుఁ బుణ్యాజనుల వెంట నేఁ బోయి కావేరీనదిలో స్నానంబుఁజేసి పాపంబులు విదిల్చి రంగనగరంబుఁ జేరంబోయి సప్తప్రాకారంబులు గడచి యాపిమ్మట మీ తిరుకోవిల సొచ్చి గారుడస్తంభంబునకు సాష్టాంగనమస్కారంబుసేసి యనేక సువర్ణ నిర్మిత శోభనా లంకారంబైన తోరణంబులు దాటి పసిండి కవాటంబులకుం బన్నిద్దఱాళ్వారులకుం బ్రణమిల్లి యనంతభూషణంబైన మీ గర్భగృహద్వారమందు నిలిచి జయవిజయుల సేవించి సహస్రఫణిఫణామాలాలంకృతంబైన భోగీంద్రుమీఁదఁ బవ్వళించియున్న నీలమేఘవర్ణంబైన నీయాకారం బారఁ జూచి నీశిరస్సున మరకత మాణిక్య పద్మరాగ వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగోన్నతంబైన కిరీటంబును గర్ణయుగ్మంబున ముత్యపుఁజౌకట్లును మకరకుండలంబుల మెఱుపుకాంతులును, తిరుమణి శ్రీచూర్ణంబు లమరునుదురును, గంధ కస్తూరి కర్పూరంబు లలందిన వక్షంబును, వైజయంతీ వనమాలికయును, జతుర్భుజంబుల రత్నఖచితంబులైన భుజకీర్తులును, హారకేయూర కంకణకటకాంగుళీయకములును, బసిఁడిజన్నిదంబును, బంగారు కంఠ హారంబును, పాదంబునఁ బసిఁడిగజ్జెలును, నవరత్నమయభూషణంబైన దక్షిణహస్తంబును, దలక్రింద వామహస్తంబును, నాజాను బాహుయుగళంబు మధ్యమున, నురముననున్న శ్రీ మహాలక్ష్మి వరకాంతవోలె నీ పాదంబు లొత్తుచుండఁ బదివేలకోట్ల సూర్యప్రభలు గలిగిన దివ్య మంగళ విగ్రహంబైన నీ యౌదార్యంబు నా కన్నుల కఱవు దీఱంజూచి రోమాంకిత పులకాంకిత శరీరుండనై నీ దివ్యపాదపద్మంబులు నా హృదయ కమలంబున నిలుపుకొని మ్రొక్కి కొనియాడి నీవు సకల లోకకర్తవని, యచ్యుతేశ్వరుండవని, యష్టభుజ నారసింహుండవు యుత్పత్తిస్థితిలయంబుల కధికారివని, శంఖ చక్ర గదా ఖడ్గ ప్రముఖాయుధ బాహుండవని, యలమేలు మంగాపతివని, నిన్నుఁగొలిచితిమి, మమ్ము గాచి రక్షింపవే శ్రీ వేంకటేశ్వరా!

# 147

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! ఆదిమధ్యాంతరహితా! అంబుజాసనాదివంద్యా! శ్రీయలమేలుమంగామనోహరా! నీనామంబు లనంతంబులట! నీ జన్మంబు లవాఙ్మనసగోచరంబులట! నీ గుణము లెవ్వరుఁ దెలియ సమర్థులుగారట! నీ నాభికమలంబునం బుట్టిన బ్రహ్మ నాళంబునుంగానక శతవర్షంబులు తిరిగి నీ నామస్మరణంబున నిన్నుఁగనెనట! అయితే యిఁక నొకటికలదు. నీ దాసులు నిన్ను విశేషించిన విశేషము లేమని విన్నవించెదను. మాటి మాటికి నీ నామంబులు విన్నవించెదను. విన నవధరింపుము. శ్రీపురుషోత్తమా! శ్రీకూర్మము లోలార్కము, వైకుంఠము, రంగనాథము, సర్పవరము, కనకగిరి, కనకాంబరగిరి, గోవర్ధనగిరి, యంజనగిరి, హస్తిగిరి, యాళ్వారులగిరి, పండరంగగిరి, గరుడగిరి, మంగళగిరి, నీలగిరి, రామగిరి, హేమగిరి, వేంకటగిరి, శ్వేతద్వీపము, హిరణ్యాద్రి, కుంతాద్రి, వృషభాద్రి, మదనాద్రి, ఘటికాచలము, శ్రీరంగము, ప్రమోదూతము, సత్యలోకము, ఆకాశనగరము, శబరీప్రకాశము, ద్వీపాంతరము, పంపాతీరము, ఉత్పల్లాపదము, అగస్త్యాశ్రమము, శరణాగతము, కదళీవనము, క్షీరాబ్ధి, బదరికాశ్రమము, నారాయణాశ్రమము, నైమిశారణ్యము, వింధ్యారణ్యము, మహారణ్యము, సుబ్రహ్మణ్యము, బృందావనము, భక్తిస్థలము, కపిస్థలము, పాదస్థలము, శ్రీనివాసస్థలము, అవంతి, వజ్రము, కాళికాహృదయము, గయ, గంగాసాగరము, చక్రవర్తనము, సాగరసంగము, చిత్రకూటము, మణికూటము, హరిక్షేత్రము, కురుక్షేత్రము, అహోబలము, శ్రీశైలము, హిమవంతము, చూర్ణప్రతీకము, కపిలము, హాటకము, నిఖిలసాగరము, మయూరము, శ్రీమద్ద్వారము, కురుకాయకము, భద్రనందనము, రవిమండలము, ఆదిశంఖము, పూనమంబరము, భీమశంఖము, మర్ధాచలము, వృద్ధాచలము. నాసికాత్ర్యంబకము, హరిహరేశ్వరము, అళఘురి, చెన్నకేశ్వరి, శ్వేతాద్రి, తోతాద్రి, శ్రీరామము, శ్రీరాఘవము, దివాభవము, పాతాళము, శక్తిసాగరము, అగ్నిపురము,

వటారణ్యము, అనంతము, కుంభకోణము, అయోధ్య, ప్రయాగ, ద్వారకావతి, జింహిల, తామ్రపర్ణి, కంచి, సింహాచలము మొదలైన యీ నూటయెనిమిది తిరుపతులయందు నవతరించితి వని వింటిని. ఆ తిరుపతులఁ జూచి సేవించ సమర్థుండఁగాను, ఇన్ని తిరుపతుల సేవాఫలంబులు నాకు నీ నీ సహాయమేగతి శ్రీ వేంకటేశ్వరా!

# 148

ఉభయవిభూతి నాయకా! ఉభయవిభూతులలో, నిత్యవిభూతి, మూఁడు లక్షల ముప్పదిరెండువేల యామడ దాటఁగా, నవ్వలనండజ బ్రహ్మాండంబు దాటఁగా నవ్వల నమరావతీ పట్టణంబు, నమరావతీ పట్టణంబు దాటగా నావల సూర్య మండలంబు, సూర్య మండలంబు దాటగా నావలఁ జంద్ర మండలంబు, చంద్ర మండలంబు దాటగా నావల నక్షత్ర మండలంబు, నక్షత్ర మండలంబు దాటగా నావల బ్రహ్మ లోకంబు బ్రహ్మలోకంబు దాటగా నావలఁ గారణవైకుంఠంబు, కారణవైకుంఠంబు దాటగా నావలం బ్రకృతి. ప్రకృతి దాటగా నావల విరజానది. విరజానది దాటగా నావలఁ బరమపదంబు. పరమపదంబు దాటగా నావల నష్టాక్షరి యనెడికోలను గలదు. ఆ కోలనిలోపలఁ గమలంబు గలదు. ఆ కమలంబులోపల నతి విస్తారమైన మంటపంబు గలదు. ఆ మంటపంబు లోపల వేయి శిరస్సులు, రెండువేల జిహ్వలుగల యాదిశేషుండు గొడుగై పానుపై యుండఁగా, భగవానులు పవ్వళించియుండఁగా, శ్రీమహాదేవియు, శ్రీమహాలక్ష్మియుఁ బాదంబులొత్తుచుండఁగాను, భగవానుల సన్నిధిని భాగవతులు తిరుకొట్టూరునంబియుఁ దిరుమలనంబియుఁ బెరియనంబియుఁ దిరుకచ్చినంబియు, మారూన్నెరునంబియు, నీ యయిదుగురును మూఁడువేళలఁ బసిండిపువ్వులఁ బూజసేయంగా భగవాను లేమనుచున్నారు. నాదాసులు నిర్భయులు. నాదాసులద్వయాధికారులు. నా దాసులు వేదాంత వేద్యులు. నా దాసుల నే నెఱుంగుట కాని నన్నెఱుంగుట కూడదు. భాగవతాపచారంబు పట్టరానిది. ఆకాశంబు పగిలిన నదుకవచ్చును. భూమి పగిలినఁ బొదుఁగవచ్చును.

సముద్రంబు పొరలినఁ గట్టవచ్చును. కాని యిటుకూడదు. భాగవతాప చారంబు దగ్ధపటలంబు. అని వేదశ్రుతులు చాటుచున్నవి. వరవరముని మంత్రంబను విత్తనంబుఁ దెచ్చి, పరమపదంబను పాదిగట్టి, చల్లఁగా నీ తిరుమంత్రంబులను పన్నీట జలకమార్చి కాలువలు దిద్ది యష్టాక్షరి యనెడి మొలక మొలపించి స్వరవేదమంత్రంబనెడి తీగఁబాఱించిన, పరిపూర్ణకటాక్షంబనెడి పువ్వుపూచి, కాయగాచి, పండుపండి, ఫల మంది, పంచసంస్కార పరుండగుట నిన్ను నే గుఱు తెలుంగుట. 'అస్మద్గురుభ్యోనమః' అనియెడి మంత్రంబుఁ బోల మంత్రంబులేదు. పూర్వాచార్యులఁ బోల మఱి యాచార్యులు లేరు. పరమరహస్యంబుఁ బోల మఱి రహస్యంబులేదు. శ్రీమహావిష్ణువుఁ బోల మఱిదైవంబు లేదు. ఇట్లు నాకెఱింగింపవే శ్రీవేంకటేశ్వరా!

# 149

ఆదిమధ్యాంతరహితా! అంబుజాసనాదివంద్యా! వేదవేదాంతవేద్యా! అవధారు! దేవా! నా విన్నప మొకటికలదు. విన నవధరింపుము. అతిఘోర సంసారాంధకారం బనియెడి యడవిలోపల నా యజ్ఞాన జన్మ జీవుం డనియెడి గజంబున్నది. అది యెటువలె నున్నదంటివా? ఆశామోహంబు లనియెడి గజ సమూహంబులం గూడి పంచేంద్రియ విషయ భోగాదులం దగిలి కామక్రోధంబులం జిక్కి, తాప త్రయంబులచే ముందు వెనుకలు గానలేక యీషణాత్రయం బనియెడి ఘోరవనదుర్గ గహనంబులం దగిలి రేయుంబగళ్లు మితిలేని తిమిరం బునం జిక్కి సన్మార్గసంచారంబు గానలేకయున్నది. అట్టి గజం బునుబట్టి తెచ్చుటకు నొక్క యుపాయంబు గలదు. అది యెట్లన్నను నీయనుమతియను దివ్య పాశంబున నీవిజ్ఞానం బనియెడి వెంట యేనుఁగుతోఁగూడఁ బెనవేసి నీకృపాకటాక్షంబనియెడి సూత్రంబున బంధించి యరి షడ్వర్గంబు లనియెడి యాశాపాశంబుల నూన్చి, నీపై భక్తి యనియెడు కంబంబునంగట్టి నీనామోచ్చారణ రహస్యార్థంబని యెడి మేఁపు మేపించి నీ తిరుమంత్రం బనియెడి జలంబుఁ బెట్టించి. భవ

జరారోగ హరంబైన యాచార్య తళిగె ప్రసాదంబను కవళంబు మేపి, ద్వయంబనియెడి జూలు గట్టించి, యష్టాక్షరంబనియెడి ఘంటలు గట్టించి, రామానుజ సిద్ధాంతం బనియెడు మురజఁ గట్టించి, కృష్ణరావహ్నత్తుం డని యెడి మావంతు నెక్కించి భాగవతసజ్జారంబునం గట్టి, యితర కింకరదోష హారంబనియెడి తుళసిదండలు దిష్టిదండలుగాఁ బూన్చి, యితరం బనియెడి భారినిగళంబు విడిపించి, నీ చరమార్థంబనియెడి యంకుశంబుఁ జేతఁబట్టి యిట్టట్టు కదలనీయక, నీ తద్దాస సంసర్గ గతులకు లీలావినోదంబుగా నెక్కుడు శత్రుక్షయమిచ్చి క్షేమంబు పాలించుకొలకున్నై పదునాలుగు దొంతర చెఱువులు దాటించి యావల బహుపాపహరంబైన విరజానది లో స్నానపానాదులుసేయించి పరిశుద్ధాత్మునిఁగాఁ జేసి శంఖచక్రక్షితాం బర వన మాలికా భరితునింగాఁ జేసి, యిందిరా స్తన్య పానం బనియెడి యుగ్గు వెట్టించి సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య పదవు లిత్తు వని సర్వ లోకజనులు కొనియాడఁగాఁ బాడగాఁ బేరుకొనఁగా విని నీ వలమేలుమంగా లక్ష్మీసమేతుండవు గావున నీ కనంతంబులైన విన్న పములు చేసికొని కొని యాడెదను. పాడెదను. శ్రీ వేంకటేశ్వరా!

# 150

అలమేలుమంగాపతీ! అవధారు దేవా! దేవా! చిత్తావధారు!

నావిన్నపంబు విన నవధరింపుము. నిరాకారంబై వాయువుస్వరూపంబై యున్న జీవుని మాతృగర్భంబనియెడు నిరవుననుంచి శుక్లపక్షంబున శుక్ల శోణితరూపంబున బదరీఫలప్రమాణంబునఁ జేసి, ద్వితీయ మాసంబునఁ గుక్కుటాండస్వరూపంబునఁ జేసి, తృతీయ మాసంబున మయూ రాండస్వరూపంబునంజేసి, చతుర్థ మాసంబున నారికేళ ప్రమాణంబునఁ జేసి, పంచమ మాసంబున శోణితాండరూపంబునఁ జేసి, షాణ్మా సంబునఁ బంచతంత్రంబులతోఁగూడిన దశవాయువుల స్వరూపంబై యున్న లింగశరీరంబున నున్న కర్మజీవునిం దెచ్చి తదీయ సూక్ష్మతనువందుఁ జొరఁదోలి మాంసశోణితంబు లాహారంబులు సేసితివట! సప్తమ మాసంబున జీవునిఁ దత్త్వజ్ఞానపరునిఁ జేసితివట! అష్టమ మాసంబున

జీవుండు గృతమిట్టి కర్మంబులుం జేసితినని తన పాపంబులు గుర్తించుచు నవమమాసంబున నారాయణ ధ్యాన పరుండగుచుఁ గరములఁ గర్ణంబులు మూసి, దశమమాసంబున ధరణిపై నుదయించి యజ్ఞానాంధకారం బనియెడి తిమిరంబుచేతఁ గప్పంబడి, కొన్ని వర్షంబులు స్తన్యపానంబునఁ గొన్ని వర్షంబు లన్నప్రాశనంబున, భక్ష్యభోజ్యలేహ్య చోష్యపానీయం బులచేతఁ బరితృప్తుండై యీవిధంబున ద్వాదశవర్షంబులు నజ్ఞాన కృత్యం బులఁజేయుచు షోడశవర్షంబునఁ బంచేంద్రియంబులఁ బ్రబలుచు రాగమద మాత్సర్యంబున మత్తగజ గమనుం డగుచు జాతి వర్ణంబులు చింతింపక వర్ణాశ్రమ ధర్మంబుల వరుసలుదప్పి జీవుండు హింసా పరుం డగుచు నేక వింశతివర్షంబుననుండి సంసారాంధకారంబునం దగిలి పుత్రేషణ దారేషణ ధనేషణంబు లనియెడి యీషణత్రయంబునం జిక్కుపడి నిన్నుఁ గానక యుండు. పంచాశద్వర్షంబున నుండి జవనత్వము లుడిగి జరాభారసంస్ఖలి తుండై యుండు. పంచసప్తతి వర్షంబుననుండి శ్లేష్మ సంకలితుండై యంధ కత్వంబునుబధిరత్వంబునునుదాసీనత్వంబును నుచ్ఛిష్టత్వంబును,గను. వాతపైత్యశ్లేష్మసంకలితంబైన ద్వంద్వరోగంబులచేత మగ్నతఁబొంది శతవర్షంబులలో వాతుండై యిహలోకంబునఁ గళేబరంబు విడిచి యాతనా శరీరధారుండగుచు యమలోకంబున కేఁగి యతి ఘోర మహా ఘోర బాధ లనియెడి నరకబాధలఁ గుందుచు నసిపత్త్రివనంబులనియెడు వన భూములం గడుదుఃఖాత్ముండై తిరుగుడు వడుచుండునట. ఇవ్విధంబం తయు నే విని భయపడి, మీ యమిత కళ్యాణ గుణంబులు కొనియాడఁ దొడంగితి. నన్నుఁగృపఁజూచి రక్షింపవే శ్రీ వేంకటేశ్వరా !

## 151

దేవనారాయణా ! పరబ్రహ్మస్వరూపా ! అఖిలాండకోటిబ్రహ్మాండ నాయకా ! పురాణపురుషోత్తమా ! పుండరీకవంద్యా ! కపటనాటక సూత్రధారీ ! అగణితమహిమావతారా ! సకలకల్యాణగుణవర్ణితా ! సకలజగదాధారా ! ఆశ్రితకల్పభూజా ! శరణాగతవజ్రపంజరా ! కారు ణ్యావతారనిధీ! భుక్తిముక్తి ఫలదాయకా! శంఖచక్రగదా శార్ఙ్గాయుధ

ధరా! కోదండదీక్షాదిగురూ! దశరథరాజతనయా! కౌసల్యాగర్భ రత్నాకరసుధాకరా! భరతాగ్రజా! సౌమిత్రిభక్తిప్రియా! శత్రుఘ్ననిరంతర సేవితా! భక్తపరాధీనా! ఇక్ష్వాకుకులతిలకా! పక్షీంద్రవాహనా! దేవాదిదేవా! తాటకాప్రాణాపహరణా! విశ్వామిత్రయజ్ఞప్రతిపాలకా! యజ్ఞకర్తా! యజ్ఞభోక్తా! 'సర్వం విష్ణుమయం జగత్' శ్రుతినికరప్రవేశితా! అహల్యాశాపవిమోచనా! పురహరకార్ముకఖండనా! సీతావివాహా! పరశురామ పరాక్రమహరణా! చిత్రకూటాచల నివాసా! విరాధదైత్యసంహారకా! శరభంగదర్శనా! దండకారణ్యనిలయా! శూర్పణఖా నాసికాచ్ఛేదనా! ఖరదూషణత్రిశిరాది చతుర్దశ సహస్ర దానవ శిరశ్ఛేదనా! మారీచ మాయామృగ వేటకాఱా! యోజనబాహు ఖండనా! జటాయు ముక్తిదాయకా! శబరీప్రసన్నా! పంచవటీతీర నివాసా! ఆంజనేయ ప్రియాలంకారా! మాల్యవత్ ప్రవేశా! వాలి నిగ్రహణా! లవణాంబుధి హల్లకల్లోలా! దక్షిణసింధు రాజబంధనా! విభీషణరాజ్య స్థాపనాచార్యా! సువేలాద్రి ప్రవేశా! కుంభ నికుంభ మకరాక్ష ధూమ్రాక్ష విరూపా క్షాతికాయ మహాకాయ కంపనాకంపన ప్రహస్త రక్తవర్ణా గ్నివర్ణ సర్వరోమ వృశ్చికరోమాది రాక్షస శిరశ్ఛేదనా! ఇంద్రజిత్తుతలగొండుగండా! రావణగిరివజ్రాయుధా! పంక్తికంఠ శిరశ్ఛేదనా! కుంభకర్ణాపహరా! ఛప్పన్నదేశ నిశ్చలపాలకా! శ్రీ రాఘవేశ్వరా! అవధారు! శ్రీ వేంకటేశ్వరా!

# 152

అర్జునసఖా! నీవు నిర్వచించినపుణ్యంబు చేసినదేవతల కూర్ధ్వలోకంబును, పాపంబుచేసిన రాక్షసులకు నధోలోకంబును, పుణ్యాపాప మిశ్రితు లయిన మనుష్యులకు మర్త్యలోకంబైన భూలోకంబును, సుజ్ఞానులయినవారికిఁ బరమపదంబును గట్టడచేసి యొసంగి త్రిలోకబంధుండవై యున్నాఁడవు. ఎవ్వరికి నపకారము చేయువాఁడవు గావు. వారు వారు తమ తమ నేర్పునేరముల మిమ్ముఁ గొందఱు మెప్పించి బ్రతికెడివారును, గొందఱు మీతో విరోధించి ఘోలయ్యువారును, ఇంతేకాని మీఖాఖు.లో

కోపకారులు. మీ ప్రభావంబు తెలియనివారు మిమ్ము దూరుదురు. ఎఱిఁగిన మహాత్ములు మిమ్ముఁ బొగడుదురు. పక్షాపరపక్షంబులు మీకు లేవు. ఇందులకు వేదశాస్త్రపురాణేతిహాసంబులు సాక్షులు. మీదాసు లయినవారు మీకుఁగా నేప్రమాణంబయినం జేసెదరు. పంపువెట్టు కొనుము. శ్రీవేంకటేశ్వరా!



## 153

అనంతకల్యాణ గుణనిధీ! నీవు భక్తవత్సలుఁడ వనుటకు సందేహమేలా? అందులకుఁ బ్రహ్లాదుండే సాక్షి. శరణాగత వజ్రపంజర బిరుదుకు సందేహంబేలా? అందుకు విభీషణుండే సాక్షి. దురితదూరుండ వనుటకుఁ దర్కవాదంబు లేలా? అందు కహల్యయే సాక్షి. నీ యుదారగుణంబున కనుమానంబేల? ఇందుకుఁ బాంచాలియే సాక్షి. ఆర్తజనపరాయణుండ వగుటకు శంకయేలా? ఇందులకుఁ గరిరాజే సాక్షి. అగణితములయిన వేదనల నవసాధించుటకు సత్యంబులేలా? అందుకు ధ్రువుండే సాక్షి. ఇవన్నియు నీ మహిత ప్రభావం బగుట యెఱింగి నీ నామోచ్చారణకే శరణు సొచ్చితిని. శ్రీ వేంకటేశ్వరా!

## 154

ఇంద్రాదివినుతా! నీ శరణాగతి ప్రభావంబు నెఱుంగునట గౌతమ మహాముని. నీ నామకీర్తన మెఱుంగునట పార్వతి. నీ జిహ్వారుచి యెఱుంగునట విదురుండు. నీ మనోభావం బెఱుంగునట శ్రీకాంతామణి. నీ మహత్త్వం బెఱుంగునట ధనంజయుండు. నీ యఖిలవిద్యా విశేషంబు నెఱుంగునట వేణునాదంబు. నీ యలంకారం బెఱుంగునట కౌస్తుభ శ్రీ తులశీవనమాలికలు. నీ జవం బెఱుంగునట వైనతేయుండు. నీ భుజబలపరాక్రమం బెఱుంగునట శార్ఙ్గ గదా ప్రముఖ దివ్యాయుధంబులు. నీ రూపవిభ్రమం బెఱుంగుదురట గోపాంగనలు. నీ భుజావిశేషంబు నెఱుంగునట వామదేవుండు. నీ భక్తవాత్సల్యంబు వైష్ణవ భాగవతోత్తము లెఱుంగుదురట! నీ శౌర్యశాంత మహిమలు వైకుంఠసన్నిధాను లెఱుంగుదురట! పూతనా హిరణ్యాక్ష రావణ కుంభకర్ణ జయ

విజయాదులు నీ తేజం బెఱుంగుదురట! నిన్ను నుతియింప సహస్ర జిహ్వుండైనను నేరండట! శ్రీవేంకటేశ్వరా!

## 155

స్వామీ! నా రక్తమాంసంబుల కొలందియే మదంబు; మదంబుకొలందియే యింద్రియంబులు; యింద్రియంబుల కొలందియే యాకారంబు; దీన ముదిమి ముంచుకొనిన నే నొరులకుఁ బ్రయోజనపడను. నా యత్నంబున కితరు లోడంబడకున్నఁ దామసభావంబులు తోచును. అంతట నా శరీరపోషణబుద్ధియు, దేవతాభక్తియుఁ బాపరహితచింతయుఁ బుణ్య సంగ్రహమును యథాయథలగును. నా నేరము లేమనిచెప్పుదును. నీవే దయతలంచిన నీడేరుదుముగాక! శ్రీవేంకటేశ్వరా!

## 156

స్వస్తిసమస్తలోక విస్తారా! పురాణ పురుషోత్తమా! శ్రీలక్ష్మీకళత్రా! కుంకుమాంకితవక్షస్స్థల గాంభీర్యా! సనక సనందన సనత్కుమార సనత్సుజాత నారదాది మునీంద్రవందితా! బలివిభీషణ ప్రహ్లాదా ర్జునాం బరీషరుక్మాంగద గజేంద్ర గుహ భృగు మృడ భారద్వాజ మార్కండేయ గౌతమ దూర్వాసో వ్యాస వాల్మీకాది మునిగణ సేవితా! శ్రుతిప్రియపూజితా! బ్రహ్మాదిసురగణవందితా! మృత్యుంజయా! త్రిమూర్త్యాత్మకా! ఇంద్రాగ్ని యమ నిఋతి వరుణ వాయు కుబేరేశానాఖ్యాష్ట దిక్పాలకేశ్వరా! క్షీరాబ్ధిశయనా! ఉత్సాహోజ్వలాలంకార బింబా! సమంచిత నవరత్నఖచిత పాంచజన్య జ్వాలాభిరామా! మత్స్యకూర్మవరాహ నారసింహ వామన శ్రీరామ రామ కృష్ణ బౌద్ధ కల్క్యాద్యవతారా! బలిబంధనా! త్రివిక్రమమూర్తీ! జమదగ్ని రామావతారా! శంఖచక్రగదాశార్ఙ్గశరాసననందకాయుధధరా! కోదండపాణీ! వేదాంతవేద్యా! మణిమయమకుటా! పుండరీకాక్షా! శ్రీపుణ్యకోటివరదా! కావేటిరంగనాథా! శ్రీవేంకటేశ్వరా!

## 157

హాటకగర్భజనకా ! వేదవ్యాసవాల్మీకాదిమునీశ్వరులునిన్ను సేవించి చిక్కించుకొని మోక్షం బడుగక యేరీతి నేమఱిరో ? శాస్త్రంబులు సదువుటతోఁ బరబ్రహ్మంబును వెదకెడి బ్రాహ్మణోత్తములైన విద్వాంసుల వివేకంబు లెందుఁ బోయెనో ? బ్రహ్మాది దేవతలు నిన్ను సేవించి నీ సాయుజ్యంబు వొందరైరే ! వారి భాగ్యంబు లెందుఁబోయెనో ? అది యట్లుండ నిమ్ము. ఆది దేవుండవైన నీ విప్పు డందఱిహృదయంబుల నున్నావట ! నిన్ను భావించి వలచి యున్నారము శ్రీ వేంకటేశ్వరా !

## 158

కరుణావరుణాలయా ! అతిప్రజ్ఞావిలసితము, అత్యంతమనోహరము, జీవనదీప్రవాహంబు చందంబున నెడ తెగక కల్పాంతంబుదాఁకఁ బాఱుచుండు నదియు నీ లీలా విభూతిమయము నగు నీ విశ్వమును బ్రవ్యక్తంబుగాఁ దోపించుచు జీవుల భ్రమయింపుచునో దేవా ! కర్తవైన నీవేల యవ్యక్తుండవై యంతర్యామివై యందకపొందక యడఁగి యుంటివన్నా ! అగపడినచో నార్తులయలజడి హెచ్చగునని వెఱపా ? వారికి నీవుగాక దిక్కెవ్వరు ? నోటిమాట చెవి వినునంతలో నార్తుల మొఱనీవాలకింతువట ! ధూర్తుల కెంతకు నందరానంత దూరముననుందువట, ఆర్తతకెంతటి యోగ్యతనతికించితివి ! ఇంత దయతో మమ్ముఁ గాచుచున్న నినుఁగన్నులకరవుదీరఁ గనుఁగొనఁగోరు కొనుచున్నారము. ఈ మనుగడనే మాకోర్కెఁగడ తేర్పవయ్యా శ్రీవేంకటేశ్వరా !

## 159

ఆదిశేషశయనా ! ఉపవాసవ్రతంబుల నిన్ను సాధించెద మంటిమా యది సముద్రసేతుబంధనంబు. నీ వేయుపాయంబుల చేతను నసాధ్యుండవు, ఇందుకు దృష్టాంతంబుగ నీ శరణంబు సొచ్చి ప్రహ్లాద నారద శుక భీష్మ విభీషణ కరి శబర్య క్రూర విదుర హనుమ త్ప్రభృతులైన భాగవతులు లోకంబులఁ బ్రఖ్యాతులైరి. ఇది మాకు దృష్టాంతంబని నిన్ను నొక్కని భజియించి నిశ్చింతంబున నుండెదము శ్రీవేంకటేశ్వరా !

## 160

కరుణాకటాక్షా ! నీ వుభయసేనామధ్యంబున నిరాయుధుండవై యర్జును నకు సారథ్యంబు సేయునాఁడు నీ దాసుండైన భీష్ముండు నీచేతఁ జక్రంబు నెత్తించె. నీ కూఁతురైన గంగాభవాని హరుని జటామకుటం బెక్కె. నీకుఁ బాన్పైన శేషుండు బ్రహ్మాండంబు నెత్తి కెత్తుకొనియె. నీకు వాహనంబైన ఖగేంద్రుం డింద్రాదుల నోడించి యమృతంబుఁ గొనియె. నీకుదాసుండైన ధ్రువుండు బ్రహ్మలోకంబు నాక్రమించె. నారదుఁడు దేవాసురులకుం బోరువెట్టుచున్నాఁడు. రుక్మాంగదుండు యమలోకంబుఁ బాడుసేసె. శుకుండు ముక్తిఁ జూరగొనియె. నీకు బంటైన యాంజనేయుం డమరుల కభేద్యమైన లంకానగరంబు దహనంబుసేసె. నీకు భక్తుండైన కుచేలుండు పిడికెఁడడుకులు సమర్పించి సంపద లనుభవించె. ఈరీతి నీదాసులు నీవిచ్చిన సలిగను నీకంటెఁ బెచ్చు పెరుగుచున్నారు. నీ దాసులకిచ్చిన చనవులును నీ సేవాప్రభావంబులును లోకంబునం జెల్లుబడియై చెల్లుచుండఁ జేసితివి. నీ కింకరుల చరిత్రంబులును, నీ యుదారత్వంబును వినియు నిన్నుఁ బొగడుచున్నారము శ్రీ వేంకటేశ్వరా !

## 161

దేవా ! బ్రహ్మరుద్రాది దేవతలైన దేవతాగణంబులు రాక్షసుల ఖండిం చిన హింసా కర్మంబు లంటవట ! అప్సరోగణంబుల వలసి నట్లనుభవిం చిన వ్యభిచారంబులు లేవట ! సోమపాన పురోడాశ భక్షణంబులు పుణ్యంబు లయ్యెనట ! ప్రసన్నులైన మీదాసులకు నేమిచేసిన దోషంబు లేల కలిగెడిని. అందఱికిని నీవు గల్పించిన సాధారణ సహజ కర్మంబులవి. ఇందఱికి నీ వంతర్యామివి. నీవు పరహితంబుగాఁ జేసెడి కృత్యంబులెం దున్నవి. పుణ్యపాపంబులు సెప్పెడి పురాణంబులు మహర్షులకు సువ్రతంబిచ్చిన నీ కింకరులకు దురితంబులు లేవని యప్పణ యియ్యవే శ్రీ వేంకటేశ్వరా !

## 162

స్వామీ! అయస్కాంతంబునకు ముఖంబు చేసి చూచిన సూదుల తి త్వరితంబు నంటుకొనినయట్లు స్త్రీలకుఁబురుషులకు నన్యోన్యావ లోకంబునకు నంటుకొనం జేయుచున్నది నీ మాయ. అది యెట్లు తప్పించు కొనవచ్చును? తింత్రిణీశలాటువులు బాలకు నోరూర్చినట్లు సువర్ణంబునకుఁ జిత్తంబు లాసపడం జేయుచున్నది నీ ప్రభావంబు. ఇది యెట్లుగాదని త్రోయవచ్చు. దొంగిలించుక పోవంగాఁదలవరులు పాశంబులఁగట్టి తెచ్చి ద్రవ్యంబులు దొంగల మెడఁ గట్టి యేఁగించినట్లు చేసినకర్మంబు లనుభవింపంజేయుచున్న నీ సామర్థ్యంబు నేరీతిఁ దప్పించుకొనవచ్చు? ఇంక నీజీవుల కే చందంబుగా నిక్కట్లు దీరికడ తేర వచ్చు? అమృతపుఁగుండ యొద్ద నుండఁగాను నాఁకట నలయనేమిటికి? నీవు నాకుఁ గలవు. నీ పాదంబులు గొలిచి బ్రతికెదను. శ్రీ వేంక టేశ్వరా!

## 163

నాగకంకణ చాపఖండనా! తాను దొలుజన్మంబునం జేయు కర్మంబు లనుభవింపక పోరాదు. అది మాకు శక్యంబుగాదు. మేము గావిం చిన నేరంబులు మా మీఁద నుండఁగాను నీకు నేమని విన్నవించుకొని యెదము. నీ దాస్యం బను వజ్రపంజరమున్నది. నీ నామస్మరణంబు లని యెడి ఖడ్గంబులున్నవి. నీవే మాపై దయఁదలంచి విచారించెదవు. శ్రీ వేంకటేశ్వరా!

## 164

అమృతమథనా! మహర్షులు మిమ్ముఁ గోరి యతిఘోరతపంబుఁ జేతురు. పక్షులు దేహంబుల గూళ్లువెట్టి నఖశిఖపర్యంతమును జీమల పుట్టలఁ బెట్టునట! ఇటువంటి నియమంబులు చేసికొని నిన్నెట్లు ధ్యానంబుఁ జేసి మెప్పించెదము. ఈ మార్గంబులు మావంటివారికి నతిదుర్లభంబులు నీకుఁ జేతులెత్తి మ్రొక్కంగలవార మింతియగాని యింతలేసి పనులకు

సమర్థులముగాము. నిన్ను నోడంబఱచి యొక విన్నపంబుఁ జేసెదము. నిన్నుఁ దెలియక మాయకు లోనైనంతగాలంబు నీ లీలకు లోనైన వారము. తెలిసితిమేని నీ దాసులయ్యెదము. అటుగావున యీ రెండు తెఱంగుల నీవారమే. ఈ విధంబుననుండి నీవుచేసిన చేఁతలయ్యె. నన్ను నీ వెప్పుడైన రక్షింపకతప్పదు. నీకు నాకు స్వామిభృత్య న్యాయంబు తప్పదు. సిద్ధంబు. ఇట నీ నామంబును మఱవనివాఁడను. తొల్లి నీవు రామావతారంబున విశ్వామిత్ర యజ్ఞ సంరక్షణంబుఁ జేసి జనకునింటికిఁ బోవుత్రోవను సహల్యయు దృణగుల్మలతాదులు నీ పాదంబులు సోకి పావనంబయ్యెనట ! అవి యే తవంబులఁ జేసినవి. మాకును నీ పాదంబులే గతి. శ్రీ వేంకటేశ్వరా !

# 165

మాయాశరీరధారీ ! కామాతురుండైన జీవుండు నీ పాదంబుఁ దలంచెనేని యాకాంతదేహంబకాని ప్రకాశమానంబైన నీ పాదంబు తనమనంబు లోపలికిరాదు. తాఁ దొల్లిఁ జూచిన రూపభావంబు లోపలికిఁ జూచిన విరహంబుఁ బుట్టించుఁ గాని ఫలంబులేదు. దీనికి బాహ్యంబులైన యింద్రియద్వారంబులు వెలుపలికి సాధనంబులు. తన మనస్సే తన్నుఁ లోనికింద్రిప్పు. అటుగావున నీ సాధనంబుల చేతను వెలుపల నీ మూర్తులు దర్శించి యా రూపంబులు, తన మనంబున ధరించి నిన్నుఁ గనుగొనుచుండెనేని బ్రహ్మానుభవమై విలసిల్లి ఫలియించును. ఇవి రెండును నీ మహిమలే. వివేకించి నేర్చినవారికి యరచేతిలోనిది ముక్తి. శ్రీ వేంకటేశ్వరా !

# 166

రమాకళత్రా ! నీవు విరజానదీతీరంబున వైకుంఠనగర వాసుండవై ముక్తా రత్న వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్యాద్యలంకార శోభితంబైన మేడమాడుగులయందు మాణిక్య శోభితంబైన సహస్ర ఫణంబులఁ బ్రజ్వరిల్లెడు నాదిశేషుండు నీకుఁ బానుపై శోభిల్లఁగా,

శ్రీదేవీ భూదేవీ నీళాదేవులు నీకుఁ గైంకర్యంబులు చేయఁగా, శంఖ చక్ర గదా శార్ఙ్గ కోదండా ద్యాయుధంబులు రూపములు ధరియించి సేవసేయంగా, విష్వక్సేన వైనతేయాదు లుభయచామరంబులు వేయగా, సనక సనందన సనత్కుమార సనత్సుజాతాది భక్తులు సేవింపంగాఁ, దుంబురు నారదాదులు నిరతముఁ బాడంగా, నప్సరసలు నృత్యములు సలుపంగాఁ, గిన్నర గంధర్వగీర్వాణ యక్ష పన్నగ గుహ్యకులు స్తుతులు సేయంగాఁ, బరమేష్ఠి ఫాలలోచన పాకశాసని వైశ్వానర యమ వరుణ వాయు నిరృతి కుబేరేశానాఖ్యాష్ట దిక్పాలకులును, నవబ్రహ్మలు, నేకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సప్తమరుత్తులు, చిత్రగుప్తులును, నవగ్రహంబులును, సప్తసాగరంబులును, సప్తనదులును, సప్తకులపర్వతంబులును, కృతయుగాదిచతుర్యుగకన్యలును, వినయ విధేయతలం గొలువఁగా, సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యంబులం బొందిన పుణ్యపురుషులు మీ పురంబున మెండై చెలంగుచుండ నవనిధులు, నైరావతోచ్చైశ్శ్రవః కామధేను కల్పవృక్ష చింతామణ్యాదులచే నయిన యష్టైశ్వర్యంబులు శోభిల్లఁగాఁ, బేరోలగంబునఁ బెద్దకొలువై కూర్చుండి మనవిచనవులు పాలింపుచు, నభయ ప్రదానంబు లిచ్చుచు మందస్మిత వదనారవిందుండవై యుండియు, సర్వజీవ దయాపరత్వంబున ననంతరూపంబులు దాల్తువట! మత్స్యావతారంబున సోమకాసురు మర్దించి వేదంబులు బ్రహ్మకు నొసంగితివట! కూర్మావతారంబున మందరగిరి మోసి నీ దాసులయిన సురలకు సకలైశ్వర్యంబులు సమకూర్చితివట! వరాహావతారుండవై హిరణ్యాక్షు మర్దించి పృథివిఁ జాపచందంబునం బఱపితివట! నరహరిరూపంబుఁ దాల్చి హిరణ్యాక్షు మర్దించి నీ భక్తుఁడైన ప్రహ్లాదుఁ గాచితివట! వామనావతారంబున బలిని బంధించి పాతాళంబునకుఁ ద్రొచితివట! పరశు

రామావతారంబునఁ గార్తవీర్యార్జునాదిచ్ఛప్పన్న దేశరాజుల మర్దించి వారలకళేబరంబులు స్వర్గసోపానంబులు చేసి పితృదేవతల మోక్షానకు నిలిపితివట ! రామావతారుండవై తాటకా ప్రాణాపహరణంబును, విశ్వామిత్ర యజ్ఞపరిపాలనంబును, నహల్యాశాప విమోచనంబును, శ్రీ కంఠ చాపఖండనంబును, సీతావివాహంబును, భార్గవగర్వాపహరణంబును, యౌవరాజ్య విఘ్నంబును, గుహ సంభాషణంబును, జటావల్కల ధారణంబును, భరద్వాజసంతోషణంబును, చిత్రకూటాద్రి నిలయంబును, భరతునకుఁ బాదుకాద్వయం బొసంగి మన్నించుటయును, విరాధవధయును, శరభంగుం గాంచుటయును, నత్ర్యనసూయలచేతఁ బూజలనందుటయును, నగస్త్య సుతీక్ష్ణ మతంగాది సకల మునివరుల యాశ్రమంబులం బ్రవేశించుటయును, మునుల కభయప్రదానంబు నొసంగుటయును, బంచవటీతీరంబున నుండి శూర్పణఖా నాసికాచ్ఛేదంబును, ఖరదూషణాది చతుర్దశ సహస్రదానవాపహరణంబును, మారీచమారణంబును, జటాయువుకు మోక్ష మిచ్చుటయును, గబంధవధయును, శబరిచేఁ బూజలందుటయును, వాలిమర్దనంబును, సుగ్రీవునికిఁ గిష్కింధా పట్టంబుఁ గట్టుటయును, దర్భశయనంబును, గంధినాథు నంపతుదికిఁ దెచ్చుటయును, సేతుబంధనంబును, సువేలాద్రినిలయంబును, రావణ కుంభకర్ణ మేఘనా దాతికాయ మహాకాయ ధూమ్రాక్ష యూపాక్ష శోణితాక్ష మకరాక్ష ఖడ్గరోమ వృశ్చికరోమ సర్పరోమా గ్నివర్ణ కంపనా కంపన ప్రహస్తాది సకల రాక్షసప్రాణాపహరణంబును, విభీషణ లంకా సామ్రాజ్య పట్టాభిషేకంబును, బుష్పకారూఢులై వచ్చి యయోధ్యాధిపత్యంబున నేకాదశసహస్రవర్షంబులు పాలించుటలును, హాలధరావతారంబున దుష్ట రాక్షస సంహరణంబును, కృష్ణావతారంబున బాల క్రీడా వినోదంబులును, గోపాలకత్వంబును, బూతనా శకటాసుర కుక్కుటాసుర ధేనుకాసుర బకాసుర వత్సాసురాది దుష్టరాక్షస

గర్వాపహారణంబును, గోవర్ధనగిరి యెత్తుటయును, గోనిర్మితంబును, గోపాంగనా జారత్వంబును, కంస శిశుపాల నరకాసుర బాణాసురాది దుష్ట నిగ్రహంబును, ద్వారకా నిర్మితంబును, నర్జునసారథిత్వంబును, దుర్యోధనకులాంతకంబును, విదురా క్రూర ముచికుందాది భక్తజన కటాక్ష వీక్షణంబును, కల్క్యవతారంబున దుష్టనిగ్రహంబును, శిష్టప్రతి పాలనంబును, వర్ణాశ్రమ ధర్మంబులు నిర్ణయించుటయును, నిట్లు యుగయుగంబుల నవతారంబులెత్తి ధర్మంబు నిర్వహించుటయును, సర్వజీవ దయాపరత్వంబునఁ దామ్ర శిలా మృణ్మయ దారువులందుల నుండి భక్తుల రక్షించుటయు, మఱియు గృహే గృహే తిరువారాధన రూపంబులై వెలసి భక్తులఁ గటాక్షింపుచుండుటయు జరపుదు వనిన నీ ప్రభావంబు లేమని వర్ణింపవచ్చును. అణురేణుతృణకాష్ఠ పరిపూర్ణుండవై నిండియుండుదువట ! ఇటువంటి నీ ప్రతాపంబులు విని యిందున నొక యుపాయంబుఁ జింతించితిని. సకల జీవులయందును బరిపూర్ణుం డవు కనుక, నాయందు నీవుండుటం జేసి నాచేయు కృత్యా కృత్యములు నీవే చేయుటగా, నీకే ప్రీతియని నిశ్చయించి, యన్ని నేర ములను నీ మీఁదనే మోపి నేను తేరకాఁడ నయితిని. కర్తా భోక్తా జనార్దన యను శ్రుతివచనము ప్రకారమునఁజేకొని, నన్నుఁ గటాక్ష వీక్షణంబుల నీ దాసానుదాసునిఁగా నెంచి రక్షింపుము. శ్రీ వేంక టేశ్వరా !



# శ్రీ వేంకటేశ్వర ప్రభాతస్తవము

శ్రీగురుం డర్థితో శేషాద్రియందు
యోగనిద్రాకేళి నున్నయత్తఱిని
వనజాసనాదిదేవత లేఁగుదెంచి
వినుతించి రప్పు డవ్విధ మెట్టిదనిన
శ్రీకర ! వేంకటక్షితిధరావాస !
నాకేంద్రనుత రమానాథ మేల్కొనుము
వసుదేవదేవకీ వరగర్భజాత
కిసలయాధర రామ కృష్ణ మేల్కొనుము
తపము పెంపున యశోదానందులకును
గృపతోడ శిశువైన కృష్ణ మేల్కొనుము
పూతనాకైతవ స్ఫురితదుర్వార
చైతన్యహారణ ప్రశస్త మేల్కొనుము
అఱిముఱి శకటాసురాంగంబు లీల
విఱుఁగఁదన్నిన యధువీర మేల్కొనుము
సుడిగాలిరాకాసి స్రుక్కడంగించి
గెడపినకెదు బాలకృష్ణ మేల్కొనుము
మద్దులఁ గూల్చి యున్మద వృత్తి మెఱయు
ముద్దుల గోపాలమూర్తి మేల్కొనుము
అద్రిరూపంబైన యఘదైత్యుఁ జంపి
రౌద్రంబు నెఱయు భూరమణ మేల్కొనుము

ఆననంబునఁ దల్లి కఖిలలోకములు
పూని చూపిన యాదిపురుష మేల్కొనుము

ఖరధేనుకాసురక్రకచ ! మేల్కొనుము
వరగర్వఘనబకవైరి ! మేల్కొనుము

చతురాననుఁడు వత్స సమితి నొంచినను
బ్రతియొనర్చిన పరబ్రహ్మ ! మేల్కొనుము

కాళియఫణిఫణాంగణ నృత్యరంగ
లాలితచరణవిలాస ! మేల్కొనుము

అతులకుబ్జామనోహరుఁడ ! మేల్కొనుము
చతురమాలాకారశరణ ! మేల్కొనుము

వనజాక్ష ! యక్రూరవరద ! మేల్కొనుము
వినయ వాక్యోద్ధవవినుత ! మేల్కొనుము

భుజ విక్రమక్రమ స్ఫూర్తిమై భోజ
గజముఁ జంపిన బాహుగర్వ ! మేల్కొనుము

జెట్టిపోరను గిట్టి చీరి చాణూరు
ఛట్టలువాపిన శౌరి ! మేల్కొనుము

కురుసైన్యవిదళనాకుంఠితోత్సాహ
భరితపాండవపక్షపాత ! మేల్కొనుము

చండ భారతరణ చాతుర్య ధుర్య
గాండీవి సారథ్య కరణ ! మేల్కొనుము

బలభేది భేదించి పారజాతంబు
నిలకుఁ దెచ్చిన జగదీశ ! మేల్కొనుము

బాణబాణాస నోద్భట భీమబాణ
పాణిఖండన ! చక్రపాణి ! మేల్కొనుము

రాజసూయమున శూరతఁ జైద్యుఁ దునిమి
పూజలందిన జగత్పూజ్య ! మేల్కొనుము

మురనరకాసురముఖ్య దానవులఁ
బొరిగొన్న యదురాజ పుత్త్రి ! మేల్కొనుము

వీరకౌరవ సభ విశ్వరూపంబు
ధీరతఁజూపిన దేవ ! మేల్కొనుము

ఇంపునఁ బృథుకంబు లిడినకుచేలు
సంపన్నుఁ జేసిన చతుర ! మేల్కొనుము

దారుణ భూభార తరణావతార
భూరిప్రతాప విస్ఫురణ ! మేల్కొనుము

సదమలానంద ! నిశ్చయముల కంద !
విదురుని వింద ! గోవింద ! మేల్కొనుము

భోజకన్యా ముఖాంభోజ ద్విరేఫ
రాజీవనయనాభిరామ ! మేల్కొనుము

వరరూపవతి జాంబవతితోడిరతుల
నిరతిమైనోలాడు నిపుణ ! మేల్కొనుము

మంజుల సత్యభామా మనస్సంగ
రంజితగాత్ర సంరంభ ! మేల్కొనుము

లలితకాళిందీ విలాస కల్లోల
కలితకేళీలోల ఘనుఁడ మేల్కొనుము

సారసుదంతా భుజకుముద హార
చారుప్రభాపూర చంద్ర ! మేల్కొనుము
నేత్రరాగ విశేష నిచితప్రతోష
మిత్రవిందారసోన్మేష ! మేల్కొనుము
భద్రానఖాంకుర బాల చంద్రాంక
ముద్రితభుజతటీమూల ! మేల్కొనుము
లక్షణా పరిరంభ లక్షితోదార
వక్షోవిశాల కవాట ! మేల్కొనుము
వేడుకఁ బదియాఱు వేలకామినులఁ
గూడిపాయని పెండ్లికొడుక ! మేల్కొనుము
కలిత నక్రగ్రాహగంభీర జలధి
వలయిత ద్వారకావాస ! మేల్కొనుము
జలదనీల శ్యామ ! జగదభిరామ !
వెలయ మేల్కొను మంచు విన్నవించుటయు
వీనులఁ గదిసిన వెలిదమ్మికన్నుఁ
గోనల నమృతంబు గురియ మేల్కాంచి
సరసిజాక్షుఁడు దేవసంఘంబు మీఁద
కరుణాకటాక్ష వీక్షణము నిగుడ్చి
శ్రీవేంకటాచల శిఖర మధ్యమున
సౌవర్ణమణి మయ సౌధంబులోన
పూగచంపక కుంద పున్నాగవకుళ
నాగరంగప్రసూన విరాజమాన

తరులతా పరివేష్టితంబైన యట్టి
నిరుపమ కోనేటి నిర్మలాంబువుల
తిరుమజ్జనం బాడి దివ్యాంబరంబు
ధరియించి దివ్యగంధము మేనఁదాల్చి
నవరత్నమయ భూషణంబులు వెట్టి
వివిధ సౌరభముల విరు లోలి ముడిచి
ధారుణీసురులకు దానంబు లొసఁగి
చేరి యక్షతములు శిరసునఁ దాల్చి
వినుతులు గావింప విబుధసన్మునుల
మనవులు విని వారి మన్నించి మించి
యగణితరత్నసింహాసనారూఢుఁ
డగుచు మేరువుమీఁది యభ్రంబువోలె
గరకంకణోజ్జ్వల క్వణనంబు లెసగ
సరసిజముఖులు వెంజామరల్ వీవ
బంగారు గుదియల పడవాళ్లు వరల
నారదవీణా నినాదంబు లెసగ
చారణ మునిసిద్ధ సంఘంబు గొలువ
నానాప్సరస్సతుల్ నాట్యముల్ సేయ
మానవేశులు మహామహులు సేవింప
ఘనతర నిత్యభోగంబులు వెలయ

జనులకెల్ల మహాప్రసాదంబు లొనరఁ
గోరినవారికిఁ గోర్కు లీడేర
నీరీతి జగముల నేలుచునుండు
నని భక్తిఁ దాళ్లపా కాన్నమాచార్యు
తనయుండు తిమ్మయ తగఁ బ్రస్తుతించె.

శ్రీ వేంకటేశ్వర వచనముల ముద్రణము సాగుచుండఁగా, రాజకీయ ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నీ ప్రభాత స్తవమును గుర్తించి యేకకవి కృతియని, యిందు దీనిని గూడఁ బ్రకటించితిని.

వే. ప్ర.



తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రాక్షరశాల, తిరుపతి.—1945.

| వచనసంఖ్య. | రాగతాళములు. | వచనసంఖ్య. | రాగతాళములు. |
|---|---|---|---|
| 1 | గుజ్జరి (ఏకతాళి) | 38 | సాళంగనాట (పల్లవి) |
| 2 | శంకరాభరణము (తివడ) | 39 | గుండక్రియ (తివిడ) |
| 3 | శ్రీరాగము (ఏకతాళి) | 40 | సామంతం (తివడ) |
| 4 | రామక్రియ (రూపకము) | 41 | దేశాక్షి (జంపె) |
| 5 | లలిత (జంపె) | 42 | ముఖారి (రూపకము) |
| 6 | భూపాల (తివడ) | 43 | కాంభోజి (తివడ) |
| 7 | మాళవిగౌళ (ఏకతాళి) | 44 | పాడి (ఏకతాళి) |
| 8 | మాళవిగౌళ (తివడ) | 45 | ఆహిరినాట (రూపకము) |
| 9 | నాట (రూపకము) | 46 | శుద్ధవసంతం (తివడ) |
| 10 | నాట (తివడ) | 50 | హిందోళవసంతం (తివడ) |
| 11 | సామంతం (జంపె) | 52 | దేశాక్షి (తివడ) |
| 12 | బౌళి (జంపె) | 53 | ధన్యాసి (తివడ) |
| 26 | మలహారి (తివడ) | 85 | మాళవి |
| 27 | భూపాలము (రూపకము) | 86 | దేశాక్షి (రూపకము) |
| 28 | సాళంగనాట (తివడ) | 87 | ధన్యాసి (ఏకతాళి) |
| 29 | సాళంగనాట (ఏకతాళి) | 88 | ధన్యాసి (జంపె) |
| 30 | వరాళి (తివడ) | 89 | బౌళి (ఏకతాళి) |
| 31 | బౌళి (తివడ) | 90 | కన్నడబంగాళం (తివడ) |
| 32 | ముఖారి (జంపె) | 91 | లలిత (తివడ) |
| 33 | నాదనామక్రియ (జంపె) | 92 | దేవగాంధారి (జంపె) |
| 34 | నాదనామక్రియ (ఏకతాళి) | 93 | హిందోళవసంతం (జంపె) |
| 35 | శ్రీరాగం (తివడ) | 94 | మలహారి (ఏకతాళి) |
| 36 | శ్రీరాగం (జంపె) | 95 | భూపాల (జంపె) |
| 37 | నారాయణి (తివడ) | | |